

*The unwise thinks evil deeds are sweet till they ripen not. As they ripen he's plunged in grief.*

---

When evil kamma's immature

the fool thinks it is honeyed,

but when the evil has matured

then to the fool comes dukkha.

పాపం పండేంత వరకు
బాలిశుడు గ్రహించలేడు
బ్రతుకొక మధు భాండమన్ని
భ్రమల్లోన మునిగుంటాడు
చివరకు చిర దుఃఖంలో
చిక్కి స్రుక్కి అణగుంటాడు.

# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.**

సంపుటి 8 ఫిబ్రవరి 1996 సంచిక 9

సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక



ముఖచిత్రం : **సీతాపహరణం**

విడిప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-

Printed, Published and Edited by RAVINDRANATH ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7612436, 7612337.

**Editorial Nest**

Plot No: 337 A, Road No. 10, Jubilee Hills, Hyderabad - 500 033. Ph. 247717.




"Do you own any stocks, bonds or Chivas Regal?"

# వర్తమాన కవిత్వోద్యమాలు అభివ్యక్తి వైవిధ్యం

- ఆర్. సీతారాం

వ్యక్తి' అనే మాటను మనం తరచుగా కవిత్వ ప్రస్తావనలో వాడుతూఉంటాం. కవిత్వ సందర్భంలో కాక మరో చోట దీనిని వాడుతున్నట్లు కనిపించదు. ఒకవేళ, ఒకటీ అరా చోట్ల వాడినా అక్కడ కూడా కవిత్వ గుణం ఉన్న చోటనే తప్ప మరో చోట ఇది అంతగా ప్రయోగించటం అరుదు. ఎందుకు కవిత్వ విషయంగానే అభివ్యక్తిని వాడుతున్నాం అనే సందేహంతో పాటుగా అసలు అభివ్యక్తి అంటే ఏమిటి? ఎందుకింత ప్రత్యేకించి దీనిని పేర్కొంటున్నాం అనే ప్రశ్నలు కూడా వస్తాయి మనకు. ఇలాంటి సందేహాత్మక ప్రశ్నలకు తాత్కాలికంగా మన ఆలోచనల మేరకు ఏదో ఒక సమాధానాన్ని రాబట్టుకుని అంతటితో 'అభివ్యక్తి' అనే మాటను గురించి మరిచి పోతుఉంటాం. ఈ దృష్ట్యానే ఒక మేరకైనా 'అభివ్యక్తి' ని నిర్వచించుకోవలసిన అవసరం కలుగుతున్నది.

సామాన్యార్థంలో అయితే, 'అభివ్యక్తి' అంటే అంతర్గతంగా ఉన్న భావాలను బాహ్యానికి ప్రకటించడం, చెప్పడం, వ్యక్తపరచడం. నిజానికి ఏ భావమైనా ప్రకటితమయ్యాకే అవగాహనకు దారి ఏర్పడుతుంది. మరట్లాంటప్పుడు ప్రత్యేకంగా 'అభివ్యక్తి' కి ఉండే ప్రాధాన్యం ఏమిటనే ప్రశ్న ఉత్పన్నమవుతుంది. దీనిలో ఉద్వేగాల ప్రకటన ఉంటుంది. ఆ ఉద్వేగాలు ప్రత్యేకమైన పద్ధతిలో ప్రకటిత మవుతాయి. కనుక అభివ్యక్తి అంటే కేవలం విషయ ప్రకటన మనే కాక విశేషార్థంలో వాడుతూఉండటం పరిపాటి అయింది. అంతే కాకుండా 'అభివ్యక్తి' అన్న పదం కవిత్వంతో విడదీయరాని సంబంధాన్ని ఏర్పరచుకుంది.

కవిత్వం ఒక ప్రత్యేక ఆలోచనా పద్ధతి, ఆవిష్కరణ విధానం కూడా. క్లుప్తంగా చెపితే పద చిత్రాలతో ఆలోచించటమే కవిత్వం. తత్ప్రకటనా రీతి అభివ్యక్తి. దీనిలో సంక్షిప్తత ప్రధాన గుణం. ఈ తరహా ఆలోచనకు కవికి ఉపకరించే సాధనం భాష. అందుకు తన ఆలోచనా క్రమంలో కవి భాషా వనరు లన్నిటినీ భావ ప్రకటన నిమిత్తం వాడుకోజూస్తాడు. నిత్య వ్యవహారంలో అందరూ వాడే శబ్దాలే వాడినా, ఆశించే ప్రయోజనాలలోనే కవికీ, యితరులకూ మధ్య తేడా ఉంటుంది. మామూలు వ్యక్తి నిత్య వ్యవహారనిమిత్తం భాషను వాడి సాధారణ ఉపయోగాలనే సాధిస్తాడు. కాని, కవి యిందుకు భిన్నంగా అసాధారణ ప్రయోజనాలను సాధించేందుకు భాషను యథేచ్ఛగా వాడుకుంటాడు.

కవి తాను చెప్పదలచిన విషయం విశేషంగా పఠిత చేత భావింపచేసేందుకు చేసే విశిష్ట భావ ప్రకటనా విధానాన్ని మనం 'అభివ్యక్తి'గా చెప్పవచ్చు. లేదా సృజనాత్మక శక్తి కలిగిన కవి విశేషార్థాల స్ఫురణకు వాడే భాషను మనం 'అభివ్యక్తి'గా పరిగణించ వచ్చు.

దీన్నే మరికాస్త వివరంగా చెపితే కవిత్వంలో కవి మనస్సును ఆకట్టుకునే విధంగా చెప్పేందుకు కొన్ని రకాల పద్ధతులను ఆశ్రయిస్తాడు. వాటిలో కొన్ని విధాలయిన భాషా నియమాలను అతిక్రమించడం ఉంటుంది. విలక్షణంగా కనిపించేందుకు సాధారణ భాషా నియమాతిక్రమణకు కవి పూనుకునే క్రమంలోనే అభివ్యక్తి కొక ఉనికి ఏర్పడుతుంది. కవి అనుభూతి, అనుభవం, ఉద్వేగం ప్రత్యేకంగా కనిపిస్తూ భాషా రూపాన్ని పొందటమే అభివ్యక్తి. ఇంద్రియ నైశిత్యం కలిగిన కవి తన

భావోద్వేగాలను పఠితకు సంక్రమింపచేయగల అపూర్వ భావ ప్రకటనా రీతిని కవిత్వాభివ్యక్తిగా వ్యవహరించే వీలుంది.

ప్రతి కవినీ ఇతర కవుల నుంచి స్పష్టంగా వేరు పరచి చూపేది అభివ్యక్తి. అభివ్యక్తి అనేది కవి కున్న సృజన శక్తి. కనుకనే కవిత్వంలో అభివ్యక్తికి ప్రాధాన్యం ఉంటోంది.

ఆధునిక కవితా సందర్భం మారి ఇంచుమించుగా ఒక దశాబ్దికాలమైంది. ఈ మారిన సందర్భం మొత్తాన్ని 'వర్తమానం'గా భావించడం సముచితంగా ఉంటుంది. మారిన సందర్భాన్ని ఆధునిక తెలుగు కవిత్వం గుర్తించబట్టే కవిత్వంలో నూత్న చైతన్యం, కొత్త దృక్పథం మొదలైనవి కనిపిస్తున్నాయి. సందర్భం మారిందనే విషయాన్ని కవులు గ్రహించడం ఒక ఎత్తు. అయితే "సందర్భం మారిందన్న సంగతి గ్రహించిన మంచి కవులు అందుకు అనువైన కొత్త తరహా కవిత్వం రాస్తారు"[1] అట్లా రాయబడే కవిత్వమే వర్తమాన కవిత్వం అవుతుంది.

వర్తమాన కవిత్వంగా చెప్పదగిన కవిత్వం రెండు విధాలుగా ఉంది. ఒకటి: స్త్రీ చైతన్య కవిత్వం. రెండు : దళిత చైతన్య కవిత్వం. వీటితో పాటుగా ప్రాచ్యదేశాలపై పశ్చిమ దేశాల ఆర్థిక, సాంస్కృతిక ఆధిపత్యం పైన నిరసన ప్రకటిస్తూ తృతీయప్రపంచ దేశం చైతన్యంతో వస్తున్న కవిత్వం కూడా ఉంది. ఆర్థిక స్థలాలను [economic spaces] ముఖ్యంగా మూడో ప్రపంచదేశాల ఆర్థిక స్థలాలను ఆక్రమించేందుకు యత్నించే ధోరణిని ప్రతిఘటిస్తూ - ప్రచ్ఛన్న యుద్ధ పరిసమాప్తి తర్వాత తలెత్తిన గ్లోబీకరణ అనే పెట్టు బడిదారీ దేశాల భావనను తిరస్కరిస్తున్న కవిత్వం కూడా మూడవ పాయగా వస్తున్నది. ఈ దృక్పథాలకు కొంచెం ఎడంగా వస్తున్న వైయక్తిక ధోరణికి చెందిన కవిత్వం కూడా బలంగానే వస్తున్నది. ఈ మొత్తాన్ని వర్తమాన కవిత్వోద్యమంగా పేర్కొనవచ్చు. ఎందుకంటే కవిత్వం ఎప్పుడైనా ఒక గమ్యం చేరేందుకు సామూహికంగా సాగే యత్నమే! దళిత, స్త్రీ చైతన్యాలు రెండూ రెండు రకాల దృక్పథాలను కవిత్వంలోకి తెచ్చాయి. కవిత్వం మొత్తాన్ని ఒక ఉద్యమంగా గుర్తించడం సబబేనా? దళిత, స్త్రీ చైతన్య కవిత్వాలకు ఉద్యమ ప్రతిపత్తిని ఏ ప్రాతిపదిక మీద ఇవ్వచ్చువననేది కూడా యిక్కడ ప్రశ్నార్థక మవుతున్నది.

మారిన వర్తమాన తెలుగు కవిత్వ సందర్భంలో స్త్రీ చైతన్య, దళిత చైతన్య కవిత్వాల గురించి ఈ నాడు అధికంగా చర్చ జరుగుతున్నది. ఈ రెంటికీ ఒక లక్ష్యం ఉంది. సామాజికమైనా, సాహిత్యపరమైనదైనా లక్ష్యోన్ముఖమై సాగే సామూహిక యత్నాన్ని ఉద్యమంగా చెప్పటం పరిపాటే. కాబట్టి వీటిని కవిత్వోద్యమాలుగా పేర్కొనడం సముచితంగా ఉంటుంది. స్త్రీ చైతన్య విషయానికి వస్తే పితృస్వామిక భావజాలం మీద తిరుగుబాటును ప్రకటించి జెండర్ వివక్షపై ఆధారపడి కొనసాగుతున్న పురుషాధిపత్య సామాజిక మూలాలను, వాటి విలువలను, అధికార సంబంధాలను వ్యతిరేకిస్తూ స్త్రీ విముక్తిని ఆశిస్తున్నది. జెండర్ వివక్షను నిర్మూలించటం ద్వారా స్త్రీ పురుష సమానత్వాన్ని అపేక్షిస్తున్నది. ఇక దళిత చైతన్యం కుల సమస్య మీద ప్రధానంగా దృష్టి సారించింది. భారతీయ సామాజిక వ్యవస్థ ప్రత్యేక లక్షణమైన కులాన్ని, కులపరంగా సామాజిక అసమానతకు, వివక్షకు గురవుతున్న వారి ఆత్మగౌరవాన్ని నినదిస్తూ ఉన్నది. కులపరంగా కొనసాగుతున్న వివక్షను తీవ్రంగా వ్యతిరేకిస్తూ కొన్ని కులాలే ఆధిపత్య గుప్పిటలో వుంచుకుని క్రింది కులాలపై సాగిస్తున్న పెత్తనాన్ని ప్రశ్నిస్తున్నది. సామాజిక అసమానతకు గురైన కులాలను వాటి ప్రత్యేక సమస్యలను పట్టించుకున్నది. ఒక్క మాటలో చెపితే ఈ రెండు కవిత్వోద్యమాలూ ఆధిపత్య భావజాలం మీద,

దాని సాంస్కృతిక మూల్యాల మీద నిరసనతో ముందుకొచ్చాయి. ఈ రెంటికీ అణచివేత, అవమానాలు, అమానవీకరణ సమానమే. కొంచెం కటువుగా అనిపించినా దళితుల కంటె పురుషాధిపత్యం క్రింద స్త్రీలు పడే అవమానాలే ఎక్కువ. ఎందుకంటే "వ్యక్తి అస్తిత్వంలో భద్రతా వాంఛ, లైంగిక వాంఛ ఒకే ప్రాణ శక్తికి వుండే రెండు రూపాలు. సమాజవ్యవస్థలో ఈ రెండూ ప్రాకృతస్థితి నుంచి కాలానుగుణమైన క్రమబద్ధతను పొందాయి. సమాజ ధర్మా లన్నింటిలాగే లైంగికనీతికి కూడా సమాజ వ్యవస్థకి అనుగుణమైనపాటి అనుల్లంఘ్యత మాత్రమే వుంటుంది. కాని అంతకు మించిన లోకాతీత మైన పవిత్రత వుండదు. అయినా మనిషిలో పరమ గాఢమైన తత్త్వం లైంగికత. అందుచేత లైంగిక నీతి ఇతర నీతులు మారినంత త్వరగా మారదు. పైగా భద్రతా వాంఛతో సన్నిహితంగా కలిసిపోయివున్న కారణాన, లైంగికతకి, అహంకారం (ego) తో అభేదం భాసిస్తుంది"[2] అంతేకాదు అన్ని వర్గ సమాజాల్లోనూ వర్గాధిపత్యం అనే ప్రయోజనం కోసం తప్పుడు చైతన్యం (false consicousness) అన్నది విరివిగా ప్రచారం పొందుతుంది. మానవ మేధ మీద ఈ తప్పుడు చైతన్యం నిరంతరం దాడి చేస్తూనే ఉంటుంది. ఫలితంగా అటువంటి సమాజాలు 'hegemonic Supremacy' ని సాధించుకుంటాయి. స్త్రీల విషయంలో ఇదే జరిగింది. రాజ్య యంత్రాంగం ఒక్క దానితోనే కాకుండా భావాల ద్వారా ఆధిపత్యం పొందటం పితృస్వామ్య వ్యవస్థ లక్షణం. స్త్రీలు పురుషుల వ్యక్తిగత ఆస్తులుగా పరిగణింపబడిన సామాజిక వ్యవస్థకి లైంగికతతో ఇంకా అస్తిత్వం ఉంది. ఈ కారణంగానే స్త్రీ చైతన్యం 'వ్యక్తిగతం కూడా రాజకీయమే' నన్న విషయాన్ని నొక్కి చెప్పింది. 'write your body' అన్న అప్రకటిత పిలుపుని స్త్రీ చైతన్య కవిత్వం సాటి స్త్రీలకు ఇచ్చింది. ఏది ఏమైనా ఈ రెండు రకాల కవిత్వాలలో వ్యక్తమవుతున్న ప్రధానాంశం 'విముక్తి' యది వీటి లక్ష్యం. కనుక అటు దళిత చైతన్య కవిత్వం, యిటు స్త్రీ చైతన్య కవిత్వం ఈ నాటి ఉద్యమాల వుతున్నాయి.

పోతే, యిప్పటి దాకా తెలుగు కవిత్వంలో అస్తిత్వ సంక్షోభంలో చిక్కుకున్న ఆధునిక మానవుడు అనుభవాన్ని అధిరూపకం (Super-metaphor) ద్వారా వ్యక్త పరచిన అజంతాను, కవిత్వంలో స్థల కాలాల మధ్య నున్న గీతను చెరిపిన తాత్వికాంశతో స్వీయానుభవాన్ని ముడివేసి భూత, భవిష్యద్, వర్తమానాల గుండా అభివ్యక్తిని పయనింపచేసిన వేగుంట మోహన ప్రసాద్‌ను, తన కవిత్వంలోకి విప్లవ దృక్పథం ద్వారా సామాజిక అభివ్యక్తిని ఆహ్వానించి వెల్లడించిన శివారెడ్డిని, అనుభవానికీ, అనుభవ స్థితికీ, అభివ్యక్తీకరణకు మధ్య అంతరం లేకుండా నిత్య నూతనంగా కవిత్వాన్ని ఆవిష్కరించిన ఇస్మాయిల్‌ను, 'కవి విశాల మానవతకు బాధ్యుడు' అని ప్రకటించి 'కవిత్వం ఒక ఆత్మ కళ'గా సూత్రీకరించిన శేషేంద్రశర్మను, విశ్వంభరుడైన మానవుడి ప్రస్థానాన్ని భిన్న రూప, నిర్మాణాభివ్యక్తుల ద్వారా ఆవిష్కరించి తనని తాను వర్తమాన కవితా స్రవంతిలోకి ప్రవహింప జేసుకుంటున్న సినారెను పేర్కొనాలి.

ఇక మనం అభివ్యక్తి గురించి ఆలోచించేటప్పుడు అనివార్యంగా భాషను గురించి ఆలోచించక తప్పదు. ముఖ్యంగా వర్తమాన కవిత్యోద్యమాలుగా మనం గుర్తిస్తున్న స్త్రీ చైతన్య, దళిత చైతన్య కవిత్వాలను గురించి, భాషను గురించి పట్టించుకోక తప్పదు.

స్త్రీ చైతన్య కవిత్వ విషయానికొస్తే ఒక ఆసక్తి కరమైన విషయం కనిపిస్తుంది. మిగిలిన అన్ని విషయాలపైన పురుషాధికారం కొనసాగినట్లుగానే భాషపైన కూడా అధికారం పురుషులదే అయింది. స్త్రీలకంటె అధిక హక్కులు, అధికారాలు పురుషులకు కల్పించి పెట్టుకున్న పితృస్వామిక వ్యవస్థతో

తలపడే సందర్భంలో స్త్రీలు తప్పని సరిగా పురుషులకు చెందిన భాషలోనే తమ భావాలు చెప్పాల్సి వచ్చింది. స్త్రీలని హీనంగా అణచివేసి తమకు లోబడి ఉండాలనుకునే దృక్పథం మీద తిరుగుబాటుకు కావలసిన భాషా సాధనాలు సామాజిక చట్రానికి వెలుపలనుంచి తేవడం స్త్రీలకు సాధ్యం కాని పని. స్త్రీ చైతన్యం వ్యక్తమవటానికి భాష కూడా ప్రధానంగా ఆటంకమైంది. ఎందుచేతనంటే అది అణచివేత దారుల భాష. స్త్రీలు మొదట దీనిని సవాలు చేయవలసింది. కాని, అలా జరుగలేదు. భాషకు Sexism ఉందని, భాషని మార్చాలన్న అంశాన్ని సకాలంలో స్త్రీ చైతన్యం గుర్తించినట్లు కనిపించదు. భాషలో Sexism అంటే? ఆ భాషలో ఉన్న పదజాలమంతా పురుషాధిక్యతను చాటేది కావటమే. అంతే కాక స్త్రీలను న్యూన పరిచేది కూడా కావడమే! తక్కిన అన్ని అంశాల్లో లాగే పురుషుల దృష్టికోణం నుంచే ప్రయోగింపబడేది కావటమే. సమాజంలో స్త్రీల వాస్తవ పరిస్థితులను, వారి అస్తిత్వాన్ని గుర్తించని, వారిని అవమానపరుస్తూ వివక్ష చూపేందుకు వీలు కల్పించిన భాషతో అనేక చిక్కులేర్పడ్డాయి స్త్రీలకు. పూర్వం కన్నా ఎక్కువగా స్త్రీ కొత్త శ్రమ స్థలాలలో, పని ప్రాంతాలలో ప్రవేశించాల్సి వచ్చింది. ఇంతకు ముందు ఆయా చోట్ల స్త్రీలు లేని కారణంగా నైతే నేమి, పురుషులే ప్రధాన పాత్రను నిర్వహించటం వల్ల నైతేనేమి పురుషాధిక్యతను చాటే పదజాలమే రూపొందింది. ఇప్పుడా స్థితి లేక పోయినా ఆ భావ జాలాన్ని భాష స్థిరపరిచింది. మారిన సామాజిక పరిస్థితుల వల్ల దృక్పథంలో మార్పుకు వీలు చిక్కింది. భాషపట్ల కూడా దృక్పథం మారసాగింది.

తమ అధీనంలో ఉన్న వారిని అణచివేయడానికి భాష కూడా ఒక ముఖ్య ఆయుధమే నన్న దృష్టి ఈనాటి భాషా వ్యవహర్తలకి వచ్చింది. అయితే భాష కాని, జ్ఞానం కాని శక్తి వంతులైన వారికి మాత్రమే మూల సంపద ఎందుకు కావాలనే ప్రశ్న వచ్చాక, ఆధిపత్య వర్గాల చేతుల్లో ఉన్న భాషను స్వాధీన పరచుకునే ప్రయత్నం కూడా ఒకటి మొదలైంది "we have inherited a contaminated language" అని మేరీ డేలీ, 'Man made language' అని డేల్ స్పెండర్ తదితర స్త్రీ వాద భాషా సిద్ధాంత కర్తలు కొన్ని ముఖ్యాంశాల్ని వెలుగులోకి తెచ్చారు. భాషాపరంగా చర్చ తగినంతగా జరిగాక స్త్రీ విముక్తి పోరాటంలో భాష ప్రధాన భూమికను నిర్వహించేదే అవుతుందన్న అవగాహనకు వచ్చారు. మనం అభివ్యక్తి గురించి మాట్లాడుతున్న సందర్భంలో భాష కూడా కీలకమే నన్నది గుర్తించాలి.

ఇక్కడ నేను ముగ్గురు కవయిత్రుల కవితల్లోని కొన్ని పంక్తులు ఉదాహరించ దలిచాను. కొండేపూడి నిర్మల 'రహస్తంత్రి' అనే కవితలో యిలా అంటుంది:

**"ఇంకా ఏదో చెప్పక ముందే**
**చెప్పాల్సిన దాంట్లో చెప్పలేక పోతున్న దేమిటో తేరుకుని**
**తేటకాకముందే..."[3]**

ఈ పంక్తుల్లో తాను చెప్పదలిచింది తొలి రజస్వలా మనఃస్థితిని. కాని భాషలేదు. చెప్పవలసింది మిగిలిపోతుంది. తన దైహిక, మానసిక అనుభవాలు రెండూ భాషలోకి అనువదించలేని అశక్త స్త్రీని యిక్కడ చూపించింది. తాను చెప్పలేక పోతున్నదేమిటో తనకు తెలుసు. ఎందుకు చెప్పలేకపోతుందో తెలియదు. ''అందుకే మాటా, మనసూ, నవ్వూ, నడకా తునాతునకలుగా చీలిపోతాం దివాళ'' అని చెప్పిన నిర్మలకు భాష గురించి తెలియ దనుకోలేం. ఆ భాషలో తాను మాట్లాడలేక పోతున్నదే తప్ప మరొకటి కాదు. అలాగే జయప్రభ 'వంగిన నల్లరేగడి భూమి' లో వృద్ధ స్త్రీ మూర్తినీ, భూమినీ కలిపి కవిత్వీకరించిన సందర్భంలో భాషలేకపోవట మనే సమస్యను ఎదుర్కొంది.

**"ఈ పదజాలమంతా వట్టిదొల్ల**
**ఇప్పటికీ ఇంకా ఇంకా**

పాలిండ్లనో... పూల పొదరిండ్లనో తలుచుకుని
చొంగకార్చే పుంగవులతో విలసిల్లే
ఈ పృథ్వి మీద
తల్లీ!
నిన్ను వర్ణించగల భాష లేదు?! మాకు"[4] అన్నప్పుడు-

'అంగుళీ మాలికలమైనా' అన్న కవితలో-
"ఈ దశ కంఠ రావణ భాషనించి
తోవ తప్పిపోయినా బాగుణ్ణు మనం!
ముంచెత్తిన కవితాప్రళయంలో
నీచ ధ్వనుల రూపాలు చెరిపి
మునిగిపోయినా బాగుణ్ణు మనం!
అప్పటికైనా ఈ కొండ చిలువ భాష
ఈ ఉరికొయ్య భాష
ఈ గుదిబండ భాష
మన మెడ విడుతుందా?"[5]

అని ప్రశ్నించిన సందర్భంలోనూ అభివ్యక్తికి ఆటంకంగా నిలుస్తున్న భాషా ప్రస్తావన ఉంది. వాస్తవానికి ఓ వృద్ధస్త్రీ మూర్తిని వర్ణించడానికి భాష లేకపోవడం పైకి పెద్ద సమస్య కాదనిపిస్తుంది. ఈ తరహా భాషా మాంద్యం, లేదా భాష చాలకపోవటం స్త్రీలు సహజంగా ఎదుర్కొనే సమస్య. ఇది జయప్రభ వ్యక్తిగత సమస్యకాదు. స్త్రీ లందరిదీ కూడా. బాగా మాట్లాడ గలిగిన, రాయగలిగిన స్త్రీలకు కూడా తమ భావాలకు తగ్గ భాష యిది కాదని, పరాయి భాషలో గొంతు విప్పుతున్నా మనేది ఏదో ఒక సమయంలో వారి అనుభవంలోకి వచ్చి ఉండే విషయమే! అందుకే జయప్రభ -

"ఎవడో కూసిన ఎంగిలి మాటలలో
మన మెలా మాట్లాడ గలం?
ఈ సారహీనంలోకి తెచ్చి
మన ప్రాణమైన కొత్త వర్ణాల నెలా నాటగలం??

అంటుంది. జయప్రభ వెతుకులాట 'నారీ నర సమానమైన బీజాక్షరం' కోసం. ఈ అన్వేషణకు దారితీసిన పరిస్థితులు పితృ స్వామ్యం కల్పించినవే నని వేరే చెప్ప పని లేదు.

సరిగ్గా యిట్లాంటి సమస్యే పాటిబండ్ల రజనికి ఎదురైంది. పై యిద్దరిదీ రాసే సందర్భం కాగా ఈమెది మాట్లాడే సందర్భం. రెండు చోట్లా స్త్రీలే. ఉభయత్రా భాషా పరమైన ఆటంకం. అంటే పురుషులకు చెందిన భాషలో తమ సంవేదనలను పలికించాల్సి రావటం. తమది కాని భాషలో తమ భావాలను చెప్పలేని స్థితిని ఎదుర్కొనటం కనిపిస్తుంది. ఈ దృష్ట్యా పురుషుల ఆధిపత్యం భాష మీద కూడా కొనసాగుతూందని చెప్పటం అతిశయోక్తి కాదు. పురుషులు స్త్రీలు మాట్లాడే భాషపైన పరిశోధన చేసిన Cheris Karamare, dominant / muted model ని ప్రాతిపదికగా చేసుకుని ఈ విధంగా సూత్రీకరించింది: "Women express dissatisfaction with domainant modes of expression and search for alternatives"[6] జయప్రభ, నిర్మల భాషతో ఎదుర్కొన్న సమస్యను ప్రత్యామ్నాయాలను వెతుక్కోవటం ద్వారా ఆపనిని పూర్తి చేయగలిగినా భాష మాత్రం వారికి

పరాయిదే అవుతుంది. దీనిని మనం భాషా పరాయీకరణ అనవచ్చు.

ఇక రజని విషయానికివస్తే - రజనిది తీరా మాట్లాడబోయే సమయం వచ్చేసరికి స్త్రీకి కలిగిన 'స్వరస్తాపం'. ఈ స్వరస్తాపం రజనికి మాత్రమే ఎదురయ్యే అనుభవం కాదు. స్త్రీలందరికీ వర్తించేదే. కవితా వస్తువుని అనుభూతితో వెలిగించి, అందుకు తగ్గ భాష దొరక్కపోవడం ప్రతి కవికీ ఎదురయ్యే సాధారణ అనుభవమే అయినా, అది స్త్రీలకు ప్రత్యేక అభివ్యక్తి సమస్యగా మారుతుంది. కొన్ని సందర్భాలలో మాట్లాడలేక పోవటం స్త్రీ, పురుషు లిద్దరికీ సహజమే ననుకున్నా, రజని స్త్రీ కావటం చేత అది స్త్రీల ప్రత్యేక సమస్యగా పరిణమిస్తుంది. తాను చెప్పాలనుకున్న భావానికి సరిపోయిన మాటలు పురుష దృక్పథాన్ని వహించే భాషలోంచి ఏరుకోవలసి రావడం వల్ల మాట్లాడలేక పోవడంగానే గుర్తించాలి తప్ప, సభాకంపం వల్ల గొంతు పూడుకుపోయి మాటలు రాకపోవటంగా అర్థం చేసుకుంటే పొరపాటు. రజని తనకు భాషతో ఏర్పడ్డ పరాయీ కరణను ఈ విధంగా చిత్రించింది:

**"మౌనాన్ని ఆభరణంగా గుచ్చి**
**అంగీకారంగా ముద్రించి**
**మూగ కాదనేందుకు పెళ్ళి చూపుల్లో పేరు చెప్పించి**
**పెళ్ళయ్యాక సమాధానాన్ని కూడా తలుపుచాటునే నిలబెట్టి**
**నవ్వుకీ, నడకకీ, మాటకీ సామెతల కాపలా పెట్టి"[7]**

అంటూ మొదలు పెడుతుంది. దీనిలో తన ప్రమేయం లేకుండానే జరిగిపోయిన అంశాలు ఉన్నాయి. దీనిలో ఆధిపత్యం విధించిన అదుపును చెప్పింది. 'గుచ్చి' అన్న పదం - మౌనంగా ఉంచడానికి చేసిన ప్రయత్నం వల్ల, మౌనంవల్ల తనకు కలిగిన బాధను సూచిస్తోంది. అంగీకరించటం తన అనుమతితో నిమిత్తం లేకుండా జరిగిందని చెప్పేందుకు 'ముద్రించి' పదాన్ని వాడింది. మిగిలిన పంక్తులతో ఒకటి వివాహ పూర్వ నియంత్రణను, వివాహానంతర అదుపును వివరించింది. మొత్తం మీద తన మీద పురుషాధిపత్యం సాధించిన అదుపును సూచించింది. అయితే తీరా తను గొంతు విప్పబోయాక ఎదురైన అనుభవం మాటేమిటి?

ఆ స్థితినే చెపుతూ -

**"ప్రతి పదాన్నీ ఏరిగుచ్చే పదునైన చూపుల ముందు**
**పలుకుదనం పలచబారి పారదర్శకమై పోతుందన్న భయం**
**పిల్లనగ్రోవి అని మోగించబోతే**
**పాయ్యాదే గొట్టమై బోలు బారుతున్న సంశయం"[8]**

అంటుంది రజని. భయ, సంశయాలు ఎక్కడనుంచి ఉత్పన్నమయాయో, ఎందుకు కలిగాయో స్పష్టంగా తెలుస్తుంది మనకు. తాను చెప్పడంలో ఏ విధంగా విఫలమయ్యేదీ 'పొయ్యాదే గొట్టం' అన్న Metaphor ద్వారా సాధించింది. ఈ భయ, సంశయ స్థితిని సృష్టించింది పురుషాధిపత్యం కనుక ఇంకా తనను వదిలి పెట్టని భీతిని గురించి కూడా చెప్పింది.

"రోజా, హారం తాలూకు జలతారులా మెడ వెనగ్గా
మెత్తగా జారే చెమట చుక్కే
మిన్నాగల్లే పాకి జలదరింపును వెన్నుకు జారు ముడెయ్యటం

మాట్లాడ మంటూ ముందుకు వంగిన మైకు
కళ్ళలో కళ్ళుంచి కొన ఊపిరి జాడ వెదికే
రాబందు ముక్కవటం"[9]

గళ్ళు గళ్ళుగా పరచుకున్న కళ్ల వలలో చిక్కకుండానే
చెప్పబోయిన వాక్యం పక్కేపిల్లలా జారిపోయాక"[10]

అంటూ రజని వ్యక్తం చేసిన భావాలు స్త్రీ మాట్లాడలేని పరిస్థితిని తెలియజెబుతున్నాయి. దీనిని శక్తిమంతంగా మన దృష్టికి తీసుకువచ్చింది రజని. ఈ మొత్తం కవితలో రజని వ్యక్తం చేసిం దేమిటి? తాను చెప్పదలచింది చెప్పలేక పోవటం గురించి, చెప్పాలనుకున్నదానికి, చెప్పిందానికి మధ్యనున్న అంతరం గురించి. చెప్పేందుకు భాష లేకపోవటం గురించి. స్త్రీల స్థితినీ, స్త్రీలను ఆ స్థితిలోకి నెట్టి నియంత్రించే భాషనీ, భావజాలాన్ని ఉద్దేశించింది కావటంతో 'స్వరస్తాపా'నికి యిచ్చిన ముగింపు యిలా ఉంది:

**"ఈ సారికైనా**
**నా అంత ఎదిగిందని కాక**
**నాకే ఎదురాడిందని గద్దించిన వాన్ననీ**
**నలభై నిముషాల ఏక శిక్షణాధిపత్యంలో**
**నాలుగు నిముషాలైనా నా వ్యక్తీకరణ కివ్వని మాష్టార్లనీ**
**క్షమించి,**
**వర్ణన కోసం పోల్చిన కంఠపు శంఖాన్ని**
**వక్తనై పూరించాల్సి ఉంది**
**నన్ను నేను జయించాల్సి ఉంది"[11]**

అని తెగేసి చెప్పింది. పురుష దృక్పథాన్ని, దృష్టి కోణాన్ని మోసే భాష తమ వ్యక్తీకరణకు చాల దని గుర్తించాకే ప్రత్యామ్నాయ మార్గాన్ని అన్వేషించటం మొద లవుతుంది. వ్యక్తుల, సమాజాల జీవితాలలో యితర విషయాల న్నిటికన్న భాషే ప్రధాన మైనటువంటిది. సామాజిక శక్తులు దానిపైన తమ ప్రభావాన్ని ప్రసరింపజేసే అవకాశాన్ని కాలం కల్పిస్తుంది. యిప్పుడు స్త్రీ చైతన్య కవిత్వం ఆ పనిని నిర్వహిస్తూ ఉన్నది. తమ అనుభవాలను గురించి రాయటం ద్వారా, ఒకరికొకరు తమను తాము వ్యక్తపరచుకోవటం ద్వారా అణచివేత స్వభావాన్ని వెలికి తీస్తున్న విధానం మనకు వర్తమాన కవిత్వంలో ప్రధానంగా కనబడే అంశం. స్త్రీలు తమ స్వీయానుభవాలను చెప్పడం ద్వారా ఇతర స్త్రీలకు అర్థమయ్యేందుకు, ఇతర స్త్రీలు తమ అనుభవాలను పంచుకోవటంలో భాగస్వాములు అయ్యేందుకు అవకాశాన్ని కల్పిస్తున్నారు. నిశ్శబ్దంగా ఉండటం అణచివేతకు సంకేతమైతే, 'విముక్తి' అంటే మాట్లాడటమే కాగలదు. ఈ మాట్లాడ్డానికి భాష తగిన విధంగా సహకరించదు. ఉపకరించదు. దీనిని ఫెమినిస్టు కవిత్వం గుర్తించింది. ఈ సందర్భంలో కెమిలా గుగ్గైన్ హైమ్ చెప్పిన విషయాన్ని ప్రస్తావించడం అవసరమే. "కొన్ని సందర్భాలలో నేను మాట్లాడుతున్నప్పుడు నాకు పదాలు దొరకవు. వాటిని పోగొట్టుకున్న భావన వస్తుంది. నా అనుభవాన్ని వివరించి చెప్పేందుకు అసంఖ్యాక పదాలను నేను ఉపయోగించినా అవి నా అనుభవాలను కచ్చితంగా వివరిస్తున్నాయని నేనే అనుకోను. అస లవి

నిజంగా నా అనుభవాన్ని వివరించడమే లేదు''. ఈ స్థితి స్త్రీలందరికీ సమానానుభవాన్నే మిగులుస్తుంది. జయప్రభ పురుష భాషలోని పదజాలాన్ని వొట్టి డొల్లన్నప్పుడు 'మనకు భాషా ప్రపంచం లేదు' అని గుర్తించినప్పుడు, మాట్లాడాలంటే 'స్వరస్తాప'మే కలుగుతుందని రజని విచారించినప్పుడు భాషా పరాయీకరణకు స్త్రీలు గురయ్యారని గుర్తించాలి.

అభివ్యక్తి గురించి చెప్పాల్సింది పోయి భాష విషయమే అధికంగా ప్రసక్తమైందేమి టనే సందేహం ఈ పాటికే రావాలి. అవును - భాష గురించి మాట్లాడకుండా అభివ్యక్తి గురించి మాట్లాడడం సాధ్యమయ్యే పని కాదు. అణచివేతదారుల భాషలో అణచివేతకు గురైన వారు తమ భావ ప్రకటనను సాధించటం విశేషమే. తమ కవిత్వంలో తమది కాని భాషతో తమకు ప్రాతినిధ్యం వహించిన పితృస్వామిక వ్యవస్థా దృక్పథాన్ని, తద్భావ జాలాన్ని దాని సారాంశాన్ని స్త్రీ చైతన్యవాదులు పునర్విశ్లేషణకు గురి చేశారు. కొత్తగా నిర్వచించారు. నూతన దృక్పథంతో చేసిన నిర్వచనాలు కవిత్వ అభివ్యక్తిలో వైవిధ్యాన్ని తీసుకొచ్చాయి.

ఇక దళిత కవిత్వ విషయానికొస్తే స్త్రీ చైతన్య కవిత్వానికి వచ్చిన సమస్యే దళిత కవిత్వానికీ ఎదురైంది. భాషమీద అధికారం పురుషుల కున్నట్లుగానే కులాల దొంతరల మీద ఆధారపడి కొనసాగే సామాజిక వ్యవస్థలో భాషపై ఆధిపత్యం పై దొంతరలో ఉన్న వారిదే అవుతుంది. క్రింది కులాల వారికి సంబంధించిన భాష వేరు. క్రింది కులాలు భాష కారణంగా ఏర్పడే సాంస్కృతిక అంతరాన్ని గుర్తించే ఉంటాయి. ఇది తమ భాష కాదన్న అంచనా వారికి స్పష్టపడే ఉంటుంది. దళిత చైతన్య కవిత్వంలోనూ తమ భావ ప్రకటన నిమిత్తం ఈ భాష సాధనంగా ఉపకరించడం లేద. స్పృహ పెరిగింది. ఈ కారణంగానే 'మాతృభాష మారువేషం'; 'యాస నా మాతృభాష'; 'రెండో అక్షరాభ్యాసం'; 'ఐదో నాచకం' మొదలైన శీర్షికలతో కవిత్వం రావటం గమనార్హం. ఇవి స్పష్టంగా భాషతో ఏర్పడ్డ సమస్యను గురించి తెలుపుతున్నాయి. అంటే భాషా పరాయీకరణను గురించి దళిత కవులు రాస్తున్నారనే చెప్పవచ్చు. దళిత చైతన్య కవిత్వం ఉధృతంగా రాసాగాక చర్చకొచ్చిన అతి ముఖ్యాంశాల్లో భాష మొదటిది కావటం గమనార్హం. దీనికి తోడుగా 'అక్షర శయ్య' లాంటి కవితలు ఆధిపత్యవర్గాల నుంచి భాషను ఎట్లా స్వాధీన పరచుకోవాలో శక్తిమంతంగా తెలియజేశాయి. దళిత కవులు:

**"తాటాకుల మధ్య మూలుగుతున్న రెండు గుడ్డి పదాల్నివ్వండి కనుగుడ్లను కుడిచేతి బొటన వేలులో తాకుతాను"[12]**

అన్నచోటే ఆగలేదు సరికదా
"భాషా - అప్రవీణులారా ఉలిక్కిపడకండి
మీరు కుదిర్చిన ఛందోబద్ధ కాపురాలను కాలదన్ని
పదాలు లేచి పోతున్నాయి
వర్ణక్రమాలు లేని వాడలకు వలసపోతున్నాయి"[13]
అనే హెచ్చరికను కూడా చేయటం మొదలు పెట్టారు.

వాస్తవానికి కవిత్వీకరణలో [Versification] దళితులు వాడుతున్న భాషా విషయమై చర్చ జరగటంలో వింతేమీ లేదు. స్త్రీ చైతన్య కవిత్వ విషయంగా వచ్చిన చర్చలో స్త్రీల వస్తువు, దృక్పథం

అన్న అంశాల మీద దృష్టి పడ్డంతగా కవిత్వంలో స్త్రీలు వాడే భాషపై దృష్టి పడలేదు. మరి, దళిత కవిత్వం రావటం మొదలయ్యాకే భాష ఎందుకు చర్చనీయ మైందిగా మారిం దనే సందేహం తలెత్తుతుంది. తమది కాని భాషలో ఏదో ఒక విధంగా తమ భావాలను వ్యక్తపరచాడానికి స్త్రీలు యత్నించారు. భాషా పరాయీకరణకు స్త్రీలు గురైనా పట్టించుకోవాల్సినంత తీవ్రంగా భాషను గూర్చి పట్టించుకోలేదు. ఈ భాషలో మేం భావాలను చెప్పలేక పోతున్నామనేటంత వరకే వచ్చారు. ఒకటీ అరా సందర్భాలు దీనికి అపవాదుగా నిలిచేవీ ఉన్నాయి. అయినా భాషను ఆక్రమించాలన్న, స్వాధీన పరుచుకోవాలన్న ఆలోచన వారికి కలుగలేదు. దళిత చైతన్యం ఇందుకు పూర్తిగా భిన్నంగా ప్రవర్తించింది. భాష పరాయిది కావటం అటు స్త్రీ చైతన్యం కవిత్వానికి యిటు దళిత చైతన్యం కవిత్వానికి సమానాంశమే అయినా భాషను ధిక్కరించేటంతగా స్త్రీల కవిత్వం లేదు. యిక దళిత కవులు వాడుతున్న భాషపై చర్చ జరుగడానికి కారణం ఏమిటి? అని ఆలోచిస్తే- "లైంగిక శక్తి యొక్క ప్రాబల్యమూ, ప్రాచీనతా, అహంకారంతో దానికున్న కారణంగా సర్వభాషలలోనూ తిట్లు స్త్రీ పురుష లైంగిక బాంధవ్య సంబంధులై వున్నాయి"[14] కులాధిపత్య వ్యతిరేక కవిత్వ రాస్తున్న దళిత కవులు కొద్దిమందే అయినా దీనిని గమనించారు. ఈ క్రమంలోనే కవులు అగ్రకుల వ్యతిరేకత, ప్రతిఘటనలలో భాగంగా స్త్రీలను అవమానించే భాషా పదప్రయోగానికి దిగారు. అప్పుడొచ్చిన ప్రతిక్రియ భాషపట్ల అభ్యంతరంగా మారటంతో భాష ఒక అంశంగా చర్చలోకి రాగలిగింది. అయితే యిక్కడ చెప్పుకోవాల్సిన ముఖ్యవిషయం ఆధిపత్యాన్ని, లేదా సమానత్వాన్ని కోరే క్రమంలోనే దళితులు భాషమీద కూడా ఆధిపత్యాన్ని ఆశించినట్లు కనిపిస్తుంది. భాషా చట్రాన్ని ఛేదించగలిగిన సౌలభ్యం, వెసులుబాటు దళిత కవుల కున్నంతగా స్త్రీలకు లేకపోయింది. భాషమీద పై కులాలకు ఉన్న పట్టును తిరస్కరించే తత్త్వం దళిత కవులలోనే ఎక్కువగా కనిపిస్తుంది.

కులాధిపత్యం చూపే వివక్షను ఒక Agression తోనూ, తీవ్ర నిరసన తిరస్కారాలతోనూ దళిత కవులు ఎదుర్కోవటం కనిపిస్తుంది.

"ఏ భాష ఏ యాస
ఏ గ్రాంథికం ఏ గ్రామ్యం
నా కిపుడు సందేహాల్లేనే లేవు

నత్తి నత్తిగా ఎలాస్టిక్ అక్షరాలతో నేను కొత్తమాట తడబడుతున్నప్పుడు ఉచ్చారణ లేని పదాలు నిప్పుల స్నానం చేశాయి కదా మీ భాష కోసం నా అర్థాన్ని బియ్యం గింజల పలక మీద జంజెం కట్టిన ఉంగరంతో రచించారు కదా"[15] అనే దళిత కవి, తన భాష ఇది కాదని గుర్తించటంతో పాటుగా "పెద్దబాల శిక్ష నా యాసలో ఎందుకు లేదు"[16] అనీ ప్రశ్నిస్తాడు

"ఇపుడైతే నాకిక
అచ్చరం రూపంతో పని లేదు
మాట సబ్దంతో పని లేదు
భావంతో కదా వివాదం"[17]

అని ఆధిపత్య సంస్కృత అందించిన భాషను విరూప పరుస్తూ తిరస్కరించగలుగుతున్నది దళిత కవిత్వం. తద్వారా ఆ భావజాలం మిద తన ఆగ్రహాన్ని ప్రకటిస్తున్నది. అంటే దళిత చైతన్యం పురుషాగ్రహాన్ని [Masculine aggression], స్త్రీ చైతన్యం Feminine Passivity ని తెలుపుతున్నాయి. అక్కడక్కడ వీటికి అపవాదుగా కనిపించే అంశాలు కూడా ఉండవచ్చు.

అనుభవంలోని సూక్ష్మభేదాలన్నిటినీ కచ్చితంగా భాషలో చెప్పలేక పోవటం వల్ల కలిగే అసహనం తొలుదొల్త భాషమీదే ఉంటుంది. యిక భాష ఎవరి చెప్పుచేతల్లో ఉంటుందో ఆ భావజాలం మీద కవులకు వ్యతిరేకతా ఉంటుంది. అందువల్లనే తమ అభివ్యక్తిని ఆటంకపరుస్తున్న భాష గురించి దళిత, స్త్రీ చైతన్య కవిత్వాలు ప్రస్తావించిన అంశాలను విపులంగా చర్చించటం జరిగింది.

---

1. నారాయణరావు వెల్చేరు - తెలుగులో కవితా విప్లవాల స్వరూపం - పుట: 163
2. నారాయణరావు, వెల్చేరు - తెలుగులో కవితా విప్లవాల స్వరూపం - పుట: 192
3. నిర్మల, కొండేపూడి - 'రహస్తంత్రి' కవిత 'నీలి మేఘాలు' - పుట: 29
4. జయప్రభ - ఇక్కడ కురిసిన వర్షం ఎక్కడి మే ఘానిది - పుట: 58
5. జయప్రభ - చైతన్య కవిత 19/20 - పుట:

యువ వసంతం - వర్షం - 1995

6. Cheris. Karemare - Women and Men Speaking పుట:3
7. పాటి బండ్ల రజని - 'స్వరస్థాపం' (కవిత)
8. Ibid - ఆంధ్రజ్యోతి, ఆదివారం
9. Ibid -
10. Ibid -
11. రజని, పాటిబండ్ల - స్వరస్థాపం (కవిత)
ఆంధ్రజ్యోతి ఆదివారం
12. సతీష్ చందర్ పంచమ వేదం పుట: 74
13. సతీష్ చందర్ పంచమ వేదం పుట: 75
14. నారాయణరావు, వెల్చేరు - తెలుగులో కవితా విప్లవాల స్వరూపం పుట: 152
15. ప్రసేన్ - ఏదీ కాదు పుట: 10
16. Ibid పుట: 10
17. Ibid పుట: 11

(తరువాయి వచ్చే సంచికలో)

# కు ణా లు డు

-డా॥ సంజీవదేవ్

అశోక చక్రవర్తికి భార్య లెందరో తెలియదు. తిష్యరక్షిత అందరికంటే చిన్న భార్య అనీ, కుణాలుడి తల్లి దేవరక్షిత అందరి కంటే పెద్ద భార్య అనీ తెలుసు. దేవరక్షితకూ, తిష్యరక్షితకూ మధ్య వున్న రాణులెందరో తెలియదు.

అశోకుని పెద్దరాణి దేవరక్షిత తన కుమారుడు కుణాలుడిని బాల్యంలోనే వదలి శాశ్వతంగా కన్నుమూసింది. అప్పటినుండి బౌద్ధభిక్షుకుడు ఉపగుప్తుడు కుణాలుని పెంచి పెద్దవాడిని చేశాడు. ఉపగుప్తునికి కాంచనమాల అనే కూతురుంది.

బాల్యంనుండి కుణాలుడు, కాంచనమాల కూడా రెండు శరీరాలూ ఒక ఆత్మగా పెరుగుతూ పరస్పర ప్రేమబంధంలో బంధితులుగా వుండిపోయారు. కుణాలుని తల్లి దేవరక్షిత కుణాలుని బల్యంలోనే మరణించింది; అదే మాదిరి కాంచనమాల తల్లి. ఉపగుప్తుని భార్య క్షేమకూడా కాంచనమాల బాల్యంలోనే మరణించింది.

అశోక చక్రవర్తి ఆ రోజుల్లో ఎల్లపుడూ దండయాత్రలూ, యుద్ధాలూ, రక్తపాతం మొదలైన వాటిలో మునిగి వుండేవాడు. తన తండ్రి బింబిసారుడు అకస్మాత్తుగా చనిపోవటంతో అశోకుడు తన అన్న అయిన సుసీమను ఓడించి సింహాసనాన్ని ఆక్రమించుకొన్నాడు. అసలు బింబిసారుడు, కూడ సహజంగా మరణించలేదు అని వాడుక. నాటి మౌర్యవంశపు కుట్రలకు, హత్యలకు, అనధికార సింహాసనాధిపత్యాలకూ హద్దులు లేవు. అశోకుడు కళింగ యుద్ధంతో భౌతిక జీవితంమీద విరక్తి తోచి బౌద్ధాన్ని స్వీకరించి ధార్మిక పంథాలోని పాంథు డైనాడు.

అశోక చక్రవర్తి ఎల్లపుడూ దండయాత్రల్లో పాటలీపుత్రం వదలి సంచారాల్లో వుంటున్న రోజుల్లో ఆయన కనిష్ఠరాణి తిష్యరక్షిత ఆయన లేని లోపాన్ని పూరిస్తూ రాజ్యాధికారాలను చలాయిస్తూవుంది.

అప్పుడు తాను మంచి యౌవనంలో, సౌందర్యంతో దేదీప్యమానంగా వున్నది. అప్పటికింకా తన సవతికొడుకైన కుణాలునికి వివాహం కాలేదు. ఉపగుప్తుని కూతురు కాంచనమాలతో వివాహం జరుగుతుందని అదివరకే స్థిరపడివుంది. కుణాలుడు ఎంతో అందమైన రాకుమారుడు. ఆయన కళ్ళు ఎంతో రమణీయంగా వుంటాయని రాజ్యం అంతటా వాడుక పడింది.

తన సవతి తల్లి తిష్యరక్షిత కుణాలుని సరిగ్గా చూసేది కాదని వాడుక పడింది. ఆయనను రాజ్యాంగ వ్యవహారాల్లో దూరాలకు పంపుతూ పాటలీపుత్రం నుండి బయటే ఎక్కువభాగం వుంచుతూఉండేది. కుణాలుడు కావటానికి రాకుమారుడైనా ఆయన అభిలాషలు, ఆశయాలు బౌద్ధ భిక్షువుల వాటికి దగ్గరలో వుండేవి. బౌతిక సుఖాల మీద అనాసక్తి, ధార్మిక విషయాల మీద ఆసక్తి, త్యాగం మీద అనురక్తి, భోగంమీద విరక్తి, ఇటువంటి సాత్వికగుణాలు కలవాడు కుణాలుడు. ఆయన అందం ఇతర వనితలకు అందరాని మకరందం అయింది.

ఆయన సవతి తల్లి తిష్యరక్షిత ఆయన స్వభావానికి వ్యతిరేక స్వభావం కలది. రాజ్యాధిపత్యం వహించాలనే తీవ్ర వాంఛతో తన కంటే వయసులో ఎంతో పెద్దవాడైనప్పటికీ అశోక చక్రవర్తికి చిన్న భార్యగా వచ్చింది. డంబం, అధికారం, క్రౌర్యం, భోగం, శరీర వాంఛ మొదలైన వన్నీ ఆమెలో సదా నివాసం చేస్తూఉంటాయి.

ఇన్ని సౌఖ్యాలతో తులతూగే, అడ్డులేకుండా జీవిస్తున్న నిరంకుశ రాణి అయినప్పటికి ఆమె ఆనందంతో జీవిస్తున్న లక్షణాలు గోచరించవు. ఎల్లప్పుడూ ఏదో తీరని కోరిక ఆమెను పీడిస్తున్నట్లు కనపడుతుంది. ఏదో పీడకల ఆమెను కల్లోలపరుస్తున్నట్లు వ్యక్తమవుతుంది. వీటితో ఆమెలో అసహనం ఎక్కువ కావటం, హింసాప్రవృత్తి పెరగటం, ఇతర్లను బాధపెట్టటంలో ఆనందం పొందటం, కక్షసాధింపు వ్యవహారం, మనోవైకల్యం, శరీర దౌర్బల్యం మొదలైనవి ప్రవేశించాయి.

ఒక వసంత సంధ్యలో పాటలీపుత్రంలోని రాజప్రాసాదపు అంతఃపురోద్యానంలో చంద్రకాంత శిలా వేదికపై విశ్రమించి ఏదో దీర్ఘాలోచనలో మునిగి వుండగా తన సఖి ప్రమద ప్రవేశించింది ఆ తావుకు. ప్రమద తిష్యరక్షితకు ఎంతో ప్రాణసఖి. ఆమెకు తెలపని రాణీ జీవితంలోని రహస్యం ఏమీ లేదు.

అంతఃపురోద్యానంలోని పూల మొక్క లన్నీ వసంత శోభను ప్రతిబింబిస్తున్నాయి. సాంధ్య ప్రకృతి ఎటు చూచినా తన్మయతను కలిగిస్తున్నది.

కాని తిష్యరక్షితలో ఏదీ ఆనందకాంతి? ఆమె ముఖంలో విషాద ఛ్ఛాయలు ఆభాసిస్తున్నాయి. కనిపించే బాహ్య ప్రకృతిశోభ అంతా ఆమెను కదలిస్తున్న జాడ ఏమీ కనబడదు. తనలోనే తానుంటుంది. కాని తన బయట ఏమి జరుగుతుందో కూడా తనకు తెలియటం లేదు. గోరువంక పిట్టవచ్చి తన చేతిమీద వాలింది, సీతాకోక చిలుక వచ్చి ఆమె కళ్ళ దగ్గర వాలింది. కొలనులోని బాతువచ్చి ఆమె వ్రేళ్లను తన ముక్కుతో సవరించసాగింది. కాని ఆమె కివేమీ తెలిసినట్లులేవు.

ప్రమద వచ్చి మరోవేదిక మీద ఎదురుగా కూర్చున్నాకూడా ఆమెవైపు రాణి చూచినట్టులేదు. ఈ అసహజవైఖరి నంతా పరిశీలిస్తూ కూచున్న ప్రమద చివరకు సాహసించి ఆమె వక్షం మీద తామరాకుతో అదిమింది. అంతటితో తిష్యరక్షిత వులిక్కిపడి లేచి కూర్చొని ప్రియసఖి అయిన ప్రమద అరచేతిని తన బుగ్గమీద ఆనించుకొని కంట తడిపెట్టింది.

అంతటితో ప్రమద కంట కూడ నీరు తిరిగింది. ప్రమద ఇంకా దగ్గరకు జరిగి రాణిని ఆనుకొని కూర్చొని ఆమె తలను తన వొడిలో వుంచుకొని ఆమె చెక్కిళ్లను నిమురుతూ అడిగింది. ఆ విధంగా విషాదంగా విషజ్వాలతో జ్వలిస్తుంటే ఎట్లాగనీ, తన తీరని బాధకు అసలు కారణం ఏమిటో చెపితే దాన్ని దూరీకరించటానికి ప్రయత్నిస్తాననీ ప్రమద బ్రతిమాలింది.

"దీనికి కారణం నీకు నేను చెప్పకూడదు, నీవు వినకూడదు, నీవు ఇతర్లకు చెప్పకూడదు, వారు వినకూడదు, అటువంటి విలక్షణమైన రహస్యం ఇది. నేను నీకు చెప్పకపోవటమేకాదు. నేను కూడా చెప్పుకోలే దింతవరకూ యీ రహస్యాన్ని. దీన్ని ఇంతకాలం నా మనసులోని అడుగుభాగంలో దాచుకోటమే కాని స్వయంగా నాతో కూడ వెల్లడించుకొనే సాహసం చేయలేకపోయాను. నాతో నేను చెప్పుకోలేని రహస్యాన్ని నీతో ఎలా చెప్పగలను" అంటూ ప్రమద వీపు చేతితో సవరించసాగింది.

ప్రమదకు ఏమీ చేయాలో తోచలేదు. రాణీమీదకు వంగి వక్షానికి పక్షం ఆనించి, ముఖానికి ముఖం ఆనించి నెమ్మదిగా అన్నది "తిష్యా! యిటుచూడు, నీమీద నీకున్న ప్రేమకంటే నా మీద నీకు ప్రేమ ఎక్కువ అని నీకు తెలుసు, నాకు తెలుసు, అటువంటప్పుడు నీవు స్వయంగా నీతో చెప్పుకోలేని రహస్యాన్ని కూడా నాకు చెప్పాలి. నీ కిదే ఆఖరి తడవ చెపుతున్నాను, ఆ రహస్యం నాకు తెలపని పక్షంలో ఇక నీ కిదే నేను ఆఖరిసారి కనిపించటం. రేపు వింటావు నీ ప్రమద యీ మర్త్యలోకాన్ని వదలి శాశ్వతంగా పయనించిం"దని అంటూ కన్నీటితో తడిసిన చెక్కిళ్లను తడిసిన

రాణీ చెక్కిళ్లకు గట్టిగా అదిమి అక్కడ నుండి లేచింది తాను వెళ్లిపోతున్నానని.

వెంటనే తిష్యరక్షిత వేదికనుండి లేచిపోబోతున్న ప్రమదను గాఢంగా హృదయానికి హత్తుకొని రహస్యం వెల్లడిస్తానని వేదిక మీద కూచోబెట్టి అన్నది, " ఈ రహస్యం నీకు చెప్పక ముందు యీ లోకంలో ఒక్కరికే తెలుసు. ఆ ఒక్కరూ తిష్యరక్షిత మాత్రమే. నీకు చెప్పిన తరువాత యీ రహస్యం యీ లోకంలో ఇద్దరికి మాత్రమే తెలిసివుండాలి కాని మూడో వ్యక్తికి తెలియరాదు. నా రహస్యం ఏ వ్యక్తికి సంబంధించినదైవుందో ఆ వ్యక్తితో కూడ ఇంతవరకూ యీ రహస్యం వెల్లడించలేదు. కనుక నీవు యీ రహస్యాన్ని భర్తకు కాని, నీ పిల్లలకు కాని ఎవ్వరికి తెలియకుండా వుంచుతావని నా చేతిలో చేయివేయి మూడుసార్లు".

ప్రమద ఆమె చేతిలో మూడుసార్లు చేయి వేసింది, తనలోని మాట తాను బ్రతికివుండగా యీ లోకంలోగాని, తాను మరణించిన తరువాత ఆ లోకంలో గాని తనలో నుండి బయటికి రాదని. తిష్యరక్షిత రెండు మూడుసార్లు బరువుగా ఆవులించింది, వళ్ళు విరిచింది; వక్షం మీద ఆచ్ఛాదనను మరొక సారి బిగించి' సవరించుకొన్నది; ముంగురులను మరోసారి పైకి నెట్టి ఆకాశంవైపు ఒకసారి, భూమివైపు ఒకసారి చూచి ప్రమద కళ్ళల్లోకి జాలిగా చూచి "చెప్పనా ప్రమదా, మరే, మరే..." అంటూ ఆగిపోయింది. మళ్లీ"చెపుతున్నాను, చెపుతున్నాను విను, విను" అన్నది. " ప్రమదా, మరోమాట; నా రహస్యం విని నీవు నన్ను అసహ్యించుకోకూడదు,.. నా కోరిక దుష్టమైంది అని నీవు నన్ను నిందించరాదు."

ప్రమదకు రాణి వైఖరి చూచి జాలి వేసింది. కోపం వచ్చింది. అన్నది " నీవు నన్ను విసిగించబోకు, చెపితే చెప్పు, లేనిచో మానేయి. నేను లేస్తున్నాను" అంటూ లేవబోయింది. కాని రాణి ఆమెను కూచోబెట్టి నాలుగు దిశలూ పరికించి చూచి దగ్గరలో కొమ్మమీద కాకిని లేవగొట్టి ప్రమద భుజంమీద చేయి వేసి ఏ చెట్టుకూడా లేని ఖాళీస్థలంలోకి తీసుకువెళ్లి ప్రమద చెవిలో అన్నది " కుణాల రాకుమారుని ప్రేమిస్తున్నాను". ప్రమదకు మూర్ఛ వచ్చినంత పని అయి తల త్రిప్పుకొని "ఆపు, ఆపు. ఇక ఆపు నేను వినలేను" అంటూ నేలకు ఒరిగింది.

కొంతసేపటికి ప్రమద తేరుకొని తిష్యరక్షిత కళ్ళలోకి కోపంగా చూచి "రాణీ, ఇదా నీ రహస్యం, ఎంత పాపకర్మానికి తలపడ్డావు తిష్యా! కుణాలుడు నీకు కొడుకు, నీకు స్వంత కొడుకు కాకాపోయినా, భర్తఅయిన అశోకచక్రవర్తికి స్వంతకొడుకు. ఇప్పుడు లేని మహారాణి దేవరక్షితకు స్వంతకొడుకు. నీ పతి కొడుకు నీకు కొడుకుకాక మరేమవుతాడు? కనుక నీవు కొడుకును ప్రేమిస్తున్నావా? అంతకంటే శాపమైన పని మరొకటుందా? ప్రేమించటానికి మరొకర్తు దొరుకలేదా? మార్చుకో, నీ అభిప్రాయాన్ని మార్చుకో ఈ వార్త అశోక చక్రవర్తి చెవుల వరకూ పోయిందా అంటే నిన్నూ నన్నూ కూడా ఖడ్గానికి బలికావిస్తారు. నీ ప్రయత్నం మానుకో!"

"లేదు ప్రమదా, నాలో యీ కోర్కె జనించినప్పటి నుండి నా కోర్కెను మార్చుకోవాలని ప్రయత్నిస్తూ వస్తున్నాను. నా కోర్కెను నేను ఎంత బలంగా అణచివేస్తున్నానో అది అంత బలంగా నన్ను కుణాలుని వైపుకు నెట్టి వేస్తూంది. ఏమి చేయను? అసహాయురాలను, ఆత్మహత్య ఒక్కటే మిగిలింది నాకిక" అంటూ నిట్టూర్చింది. మళ్ళీ అనసాగింది, " జీవిస్తే కుణాలునితో కలిసి జీవించాలి. లేనిచో మరణించాలి."

ప్రమద అందుకొంది: "మరణించబోకు, ఏమైనా సాధించాలంటే జీవించే సాధించు, అసాధ్యమైన

వ్యవహారాన్ని చేపట్టావు. ఈ అసాధ్యం సాధ్యం అయే అసాధ్యం కాదు. అది అయేదీ కాదు, దాన్ని నీవు విరమించుకోనూ లేవు. సరే, నేటికి లోపలికి పోదాం పద!'' అంటూ ఇద్దరూ అంతఃపురంలోకి వెళ్లారు.

కుణాలుడు చాలా కాలంగా బౌద్ధక్షేత్రాలను దర్శించి పాటలీ పుత్రానికి తిరిగి వచ్చాడు. తండ్రి కళింగ దండయాత్రనుండి ఇంకా తిరిగి రాలేదు. రాజ్యాంగ వ్యవహారాలను నిర్వహిస్తున్న సవతి తల్లి తిష్యరక్షితను ఒకసారి కలుసుకొని తనను ఏమి చేయమని ఆజ్ఞ లిస్తుందో తెలుసుకోవాలని నిర్ణయించాడు.

ఆమె అంటే తన కెంతో గౌరవం.

ఒకనాటి మధ్యాహ్నానంతరం తాను రాణిని చూడవస్తున్నట్లు వార్త పంపి కుణాలుడు తిష్యరక్షిత నివాసానికి వెళ్లి ఆమె దర్శనం చేసుకొన్నాడు. కుణాలుడు తనను చూడ వస్తున్నాడని తెలిసినప్పటి నుండి తిరిగి తిష్యరక్షిత మానస సముద్రంలో తిమింగలాలు కల్లోలం ప్రారంభించాయి. ఇంతవరకూ తనలోనే సమాధి అయివున్న తను వాంఛను నేడు కుణాలునికి తెలుపాలని నిర్ణయించుకొంది. ఏమని తెలుపటం, ఎట్లా తెలుపటం, ఆ తెలుపటానికి ప్రారంభం ఏయే మాటలతో సాగించాలి. మొదలైన వాటిని నిర్ణయించుకోటంలో నిమగ్న అయి వున్న దామె.

ఇంతలో కుణాలుడు నెమ్మదిగా నతమస్తకంతో వచ్చి, "తల్లీ నమస్కారం!'' అన్నాడు. "తల్లీ'' అనే సంబోధన విని తిష్యరక్షిత తల్లడిల్లిపోయింది. వెంటనే తేరుకొని ఆయనన్ను ఉచితాసనం మీద కూర్చోమని వ్రేలు చూపింది. "కుణాల్, కుశలమా? చాలా కాలం పర్యటనలు చేసి వచ్చినట్లున్నావు. కొంతకాలం రాజధానిలోనే వుండి విశ్రాంతి తీసుకో!'' అని ఆయన కళ్ళవైపే ప్రత్యక్షంగా కాక పరోక్షంగా చూడసాగింది.

"అవును తల్లీ! మీ వాత్సల్యం వల్ల.'' వాక్యం పూర్తికాక ముందే రాణి అడ్డువచ్చింది. "తల్లీ! ఎవరు తల్లి? నీ తల్లి దేవరక్షిత చనిపోయి సంవత్సరాలకు సంవత్సరాలు గడచిపోయాయి. ఇంకా ఆమెను సంబోధిస్తా వెందుకు? నీ తల్లిని మరచిపో'' అని ఆమె ఇంకేమేమో అనబోతుండగా కుణాలుడు అడ్డు తగిలి అన్నాడు "లేదు తల్లీ నేను తల్లి అని సంబోధించింది మరణించిన తల్లి దేవరక్షితను కాదు, జీవించివున్న తల్లి తిష్యరక్షితను''.

రాణి కొంచెంగా నవ్వును నటించి, "తిష్యరక్షిత నీకు తల్లి కాదు. అశోక చక్రవర్తికి భార్య మాత్రమే అనేది సదా నీవు గుర్తుంచుకో తిష్యరక్షిత గర్భంలో నవమాసాలు నీవు పెరగలేదు. తిష్యరక్షిత నుండి నీవు భూమిమీద పడలేదు. అటువంటప్పుడు ఆమె నీకు తల్లి ఎట్లా అవుతుంది? ఆమెకు నీవు కొడుకువు ఏ విధంగా అవుతావు? నీ తండ్రి భార్య లంతా నీకు తల్లులు కారు, గుర్తుంచుకో! నీకు తల్లినయే వయస్సు నాకున్నదా?'' అన్నది.

తిష్యరక్షిత ఇంకా సాగించింది: "నీవైఖరి, నీమాటలు, నీవు దర్శిస్తున్న బౌద్ధక్షేత్రాలు చూస్తూంటే నీవు అపర బుద్ధుని వలె కనిపిస్తున్నావు. బౌద్ధమత ప్రచారం వల్ల దేశం నిర్వీర్యం అయిపోతూంది. మనుషులు పనులు మానుకొని సోమరితనాన్ని పెంచుకొని, భిక్షా పాత్రలు పుచ్చుకొని సగం చచ్చిన రూపాల్లో అర్థంలేని మాటల్ని అమాయక ప్రజలకు చెపుతూ వాడవాడా తిరుగుతున్నారు. బుద్ధుడు చెప్పిం దొకటి, వారు చెప్పేది మరొకటి, బుద్ధుడు చేసిం దొకటి, వారు చేసేది మరొకటి, కుణాల్, నీవు ఆ బురద ప్రవాహంలో పడి కొట్టుకపోబోకు, తీరాన్ని చేరుకో!'' అని హిత బోధ ప్రారంభించింది.

కుణాలుడి ముఖంలో స్వల్పంగా చిరునవ్వు పొడసూపింది, "ఏమిటి తల్లీ, ఆ మాటలు, ధర్మవిరుద్ధంగా మాటాడుతున్నారు? బౌద్ధ ధర్మం మనుషులను సోమరులు కమ్మనీ, నిర్వీర్యులు కమ్మనీ, బిచ్చగాండ్రు కమ్మనీ ఏనాడూ బోదించలేదు, కాని ప్రజలు బౌద్ధం పేరుతో ఆరకమైన పనికిమాలినవాళ్ళుగా తయారవుతున్నారు. అది వాళ్ళ తప్పు కాని బౌద్ధం తప్పుకాదు, భైక్షుక వృత్తిని అవలంబించటానికి అందరికీ హక్కులేదు. సంబోధిని పొందిన వాళ్ళకు మాత్రమే హక్కుంది. కాని దాన్ని విస్మరించి పనిచేయని ప్రతివాడూ భిక్షువుగా తయారయి సోమరిగా జీవిస్తున్నాడు. ప్రజలు ఏమి చేస్తున్నారనేది మనకు దాఖలా కాదు. ఏమి చేయకూడదు అనేది దాఖలా. ఇప్పుడు సమాజంలో వున్న ఇటువంటి వక్ర మార్గాలను సక్రమం చేయడమే నా జీవనాదర్శం. అందుకు మీరు కూడా నాకు సహకారా న్నందిస్తారని ఆశ" అని ముగించాడు.

తిష్యరక్షిత విషపు నవ్వు నవ్వింది. "నీ ధర్మోపదేశాన్ని అంతటితో ఆపు, కుణాల్, యవ్వనంలో వున్నావు. రూపవంతుడవు, శరీరం ఇచ్చే సర్వ సౌఖ్యాలు అనుభవించ తగి ఉన్నావు. ఈ ప్రపంచంలోని స్పర్శ, వాసన, రుచి, శబ్దం, రూపం ఇవన్నీ కూడ మనిషి చేత పరిత్యజించబడటానికి కాదు వున్నాయి, అనుభవించబడటానికి మాత్రమే! ఇంద్రియాల ద్వారా ప్రత్యక్షంగా లభించే ఆనందాలను వదలి ఏదో వున్నదో లేదో తెలియని అతీంద్రియానందం నిమిత్తం ప్రాకులాడటం సహజ మానసికారోగ్యం కాదు. నీ యవ్వనాన్ని వ్యర్థం చేసుకోకు కుణాల్. నీ తండ్రిని వివాహ మాడి నా యవ్వనాన్ని వ్యర్థం చేసుకొంటున్నాను. వ్యర్థం కాకుండా వుండటానికి నీ సహకారం దొరుకుతుందని ఆశించాను. కాని నీది వ్యతిరేక పంథా అయింది" అని కుణాలుని జవాబు నిమిత్తం నిరీక్షించింది.

ఆమె ధోరణికి కుణాలుని శరీరం వణకి పోయింది, మనసు చెదరి పోయింది. ఆమె నుండి ఇటువంటి అవాంఛనీయ వాక్కులను ఆయన ఎన్నడూ ఆశించి ఎరుగడు. విస్తుపోయి కొంచెం కటువుగా అన్నాడు " ఏమిటి తల్లీ, నీ వింత ధోరణి? నీ మాటలు సరిగా నా కర్థం కావటం లేదు. అర్థమైన కొన్ని మాటలు అనర్థానికి బాటలుగా ఉన్నాయి. ఇటువంటిది తండ్రిగారికి తెలిస్తే ఏమవుతుందో! సరే నేను వెళ్ళివస్తాను." లేచిన కుణాలుని కంపించే శరీరాన్ని తన కంపించే చేతితో పట్టుకొని కూర్చోబెట్టింది.

" ఆహా, నీ తండ్రిగారికి తెలిస్తేనా? ఏమి తెలిస్తే? అసలు నీ తండ్రిని నేను వివాహమాడింది నీ తండ్రిని చూచి కాదు, నిన్ను చూచే, నీ తండ్రి నిమిత్తం నీ తండ్రిని వివాహ మాడలేదు, నీ నిమిత్తమే నీ తండ్రిని వివాహమాడాను. నిజం చెపుతున్నాను, నిన్ను నేను తీవ్రంగా ప్రేమిస్తున్నాను కుణాల్!" అన్నది తిష్యరక్షిత తీవ్రంగా.

కుణాలుడు గజగజ వణకిపోయాడు. తేరుకొని అన్నాడు "తల్లి కొడుకును ప్రేమించటంలో విచిత్రం ఏముంది తల్లీ? మాతృప్రేమ, పుత్రపేమ ఎంతో పవిత్రమైనవి. మీకు నా మీద పుత్రప్రేమ ఉన్నట్లే మీ మీద నాకు మాతృప్రేమ ఉన్నది, నేనూ ప్రేమిస్తున్నాను మిమ్మ్మ తల్లిగా!".

తిష్యరక్షితకు కళ్లెర్రబడినయి. ఆసనం మీదనుంచి లేచింది. "విషయాన్ని నీ తెలివైన మాటలద్వారా పెడదారి పట్టించబోకు. నిన్ను నేను తల్లిగా ప్రేమించటం లేదు, ప్రియతమగా ప్రేమిస్తున్నాను; వాంఛిస్తున్నాను, కామిస్తున్నాను" అంటూ కుణాలుని కౌగలించుకోబోయింది. కుణాలుడు ఆమె సగం కౌగిలింత నుండి బయటబడి వెళ్ళిపోతున్నాడు. పెద్ద గొంతుతో ఆమె అరచింది. "కుణాల్, నన్ను పగపట్టిన నాగినిని చేసిపోతున్నావు, కాంచనమాలతో నీ వివాహం ఎప్పటికీ జరుగనివ్వను. నీకు

కూడా ఏమి సంప్రాప్తం కాన్నదో చూచుకో''.

తడబడే కాళ్లతో కుణాలుడు వెళ్ళిపోయాడు. తిష్యరక్షిత నేలకూలిపోయింది. సగం స్పృహలో ఆమె నోటినుండి మాటలు వెలువడుతున్నాయి. "కుణాల్, కుణాల్, నన్ను తిరస్కరించి వెళ్లిపోయావా? నీ వివాహం కాంచనమాలతో జరుగనీయను. నీ సుందరమైన కళ్లు కాంచనమాలను చూడటం నేను సహించలేను. ఆమె నీ సుందరమైన కళ్ళను చూడటం కూడా నాకు అసహనీయం. చూచుకో నీభవిష్యత్తును ఏమి చేస్తానో!''

కుణాలుడు బయటి కెళ్లటం చూచి ప్రమద లోపలికి ప్రవేశించింది. రాణి ప్రలాపాలు వింటూ నిలబడింది ఆమె. విషయం అవగతం అయింది ప్రమదకు, ఏమిచేయాలో తోచలేదు. ఇంతలో రాణి సహజచేతనలోకి వచ్చి కూర్చొని ప్రమదను చూచి దుఃఖించసాగింది. " అంతా ముగిసింది, నేను అంతిమ నిర్ణయాని కొచ్చాను. రేపు ఈ సమయానికి పరిస్థితులు భయంకర రూపం తాల్చివుంటాయి. అశోక చక్రవర్తి కళింగ విజయాన్ని పొంది రేపు ఉదయానికి తిరిగి వస్తున్నారట. పాటలీపుత్రానికి ఆయన వచ్చే లోపలే నా వ్యూహం సఫలం కావాలి. నీవు ఇక వెళ్లిపో. నా ప్రయత్నంలో నేనుంటాను''.

ఇంకా తెల్లవారలేదు; చీకటిగానే వున్నది. ఒక పాడుపడ్డ ఉద్యాన వాటికలో " బాధ, బాధ, కళ్లలో బాధ! భరించలేని బాధ కళ్ళలో!'' అంటూ కుణాలుని పలుకులు వినిపిస్తున్నాయి. అనుకొని కాంచనమాల కుణాలుని మీద చేయి వేసి చూచొని వున్నది. " మీ ఆర్తనాదం వినే ఆ ప్రక్క కుటీరం నుండి నేను పరుగెత్తుక వచ్చాను. నా రాకా, దుండగులు పారి పోవటం ఒకేసారి జరిగినయి. ఘోరం జరిగిపోయింది. అంత ఘోరానికి పూనుకొన్న దుష్టశక్తులేవో అర్థంకావటంలేదు. నేటినుండి మీకు దృశ్యజగత్తు లేదు. మిమ్ము నేను చూస్తాను కాని నన్ను మీరు చూడలేరు. కళ్ళు పోగొట్టే బదులు చెవులు పోగొట్టినా బాగుండేది.

గ్రుడ్డికంటె చెవుడు మేలు. మీకు దిగులు వద్దు. మీకు కళ్లుండగా నేనేమిటో కళ్ళులేనప్పుడూ మీకు నేనంతే. మన జోటికి నాలుగు కళ్ళు అవసరం లేదు. జోటికి రెండు కళ్ళుచాలు. ఇక మన జంటకు వియోగం లేదు. పదండి పట్టణం వదలి పాటపాడుతూ భిక్షాటనం చేసుక జీవిద్దాం. బుద్ధ ధర్మానికి జీవితంలో సజీవ రూపం ఇద్దాం'' అన్నది.

కుణాలుడు లేచి నిలబడి కాంచనమాలను చేతుల్లోకి తీసుకొని అన్నాడు'' నా కళ్ళు లేకపోయినా నన్నే అంటిపెట్టుక తిరుగదలచావా? మంచిది. నీ అభిలాషను నేను కాదనగలనా? చర్మ చక్షువు లున్నంతవరకు మానస చక్షువులు సక్రమంగా చూడజాలవు. నా చర్మ చక్షువులు అంతరించాయి కనుక నా మానస చక్షువులు పూర్తిగా మేలుకున్నాయి. నాలోని బాహ్యదృష్టి అస్తమించి అంతర్ దృష్టి ఉదయించింది! పద పోదాం విశాల విశ్వంలోకి, ఈ పట్టణాన్ని వదలి. తెల్లవారితే అశోక చక్రవర్తి పట్టణంలో ప్రవేశిస్తాడు. ఆయనరాక ముందే మనం పట్టణం వదులుదాం.''

కొంతకాలం గడిచిన తరువాత ఒక ఉదయాన అశోక చక్రవర్తి రాజ ప్రాసాదం ముందు ఒక స్త్రీ, ఒక కళ్లులేని పురుషుడూ భిక్షాపాత్రలతో నిలబడి వున్నారు. తమ స్వంత రాజప్రాసాదంనుంచే తాము భిక్ష నందుకొంటున్నారు.

రాజప్రాసాదానికి అంధుడుగా రావటం అదే ప్రథమం కుణాలునికి, కళ్లు లేని కుణాలుడు ప్రాసాదం ముందు నిలుచున్న పది నిమిషాల్లో ఎన్ని సంవత్సరాల దీర్ఘస్మృతుల స్రవంతి ఆయనలో ప్రవహించిందో! భిక్ష తెచ్చిన వ్యక్తి వారి నోటినుండి విన్నది :

"బుద్ధం శరణం గచ్ఛామి<br>
ధర్మ శరణం గచ్ఛామి<br>
సంఘం శరణం గచ్ఛామి''

# ధ్వని

– పుట్టు మురళీ రావు

ప్రవరుడు వరూధినిని 'కామశాస్త్రోపాధ్యాయినా వచించెదవు' అన్నాడు. ఆమె ఆవేశానికి అడ్డుకట్టవేయడానికి అనేక విధాల ప్రయత్నించాడు. కాని ఆమె కైపు దిగలేదు. ఎక్కడి వాడో మహీసురాన్వయంలో యిటువంటి అందగాడు, రూపసి, నవ మోహనాంగుడు ఎలా పుట్టాడబ్బా అనుకొంది. అది ఏకాంత మనీ, తాను జవరాలిననీ చెప్పింది. ఆనందో(బ్రహ్మ అంది. "ముని(ముచ్చులెల్ల తామరసనే(త్రలిండ్లలో బందీలే" అంది. 'అందు కోసం అవకాశాన్ని చేజార్చుకోకు ర' మ్మంది అయినా ఫలితం కన్పించలేదు. అప్పుడు -

*ప్రాంచద్భూషణ బాహుమూల రుచితో పాలిండ్లుపొంగార బై*
*యంచుల్ మోవగ గౌగలించి, యధరం బాసింప! శ్రీహరీ*
*యంచున్ బ్రాహ్మణు డోర మో మిడి తదీయాంస ద్వయం బంటి పా*
*మ్మంచున్ ద్రోచె, కలంచునే సతుల మాయల్ ధీరచిత్తంబులన్?*

మనకు లభ్యమైన రచనల్లో అల్లసాని వారి మనుచరిత్ర ఒక్కటే ఆయన రచనగా నున్నది. ఒక్క కావ్యం రచించినంత మాత్రము చేతనే ఈ కవిశేఖరుణ్ణి, "అల్లసానిపెద్దన కవీంద్ర ఆంధ్ర కవితాపితామహ!" అని ఆంధ్ర భోజుడు అప్యాయతతో ఎందుకు పిలుచుకొన్నాడంటే, రస సిద్ధిలో ఆయన చేసిన సాము గరిడీలు అనితరసాధ్యములు, అనిదంపూర్వములు అయి వుండుటవలననే! ఈ పద్యములో బాహుమూల రుచులు, పాలిండ్లు, పై యంచుల్ మోవగ గౌగిలించడాలు, వెర్రిబాగుల బాపనయ్య ఏ పని చేసినా ముందు శ్రీహరీ అనడాలు, ఓరమోము పెట్టడాలు, అంసద్వయాన్ని మాత్రమే అంటడాలు, ఇవన్నీ పెద్దనకే తెలుసు. వరూధిని వంటి ప్రౌఢ అప్సరస ప్రవరుని పైన బడేటప్పుడు ఆమె బాహుమూలములలోని తళుకు ప్రాంచద్భూషణములతో ప్రకాశ మానముగా నుండిన దన్నాడు. బాహుమూలాల్లో రుచి (కాంతి) ఉంటుందని వ్రాయగల్గడం పెద్దనకే తెలుసును. ఆ సమయంలో వరూధిని పాలిండ్లు పొంగారాయట. స్తనాల్ని పాలిండ్లు అని వర్ణించాడు. అవి పాలిండ్ల స్థాయికి చేరుకొనడానికి ఆమె ప్రౌఢగనుక సాధ్యపడింది. పాలిండ్లయితేనే అటువంటి సందర్భాలలో పొంగారుతాయిగదా! అదిగాక ఆమె పైయంచుల్ మోసేటట్లు కౌగలించిందన్నాడు. పాలిండ్లకు పొంగారేటప్పుడు పైయంచు స్పష్టమవుతుంది గదా! ఆ కౌగలింత వరూధినినుండి మాత్రమే (పేరణ చెందింది గనుక, ప్రవరుడు స్పందించి, సహకరించలేదు గనుక పై యంచుల్ మాత్రమే మోసిన వట. ఆమె అధరాన్ని ఆశిస్తే వెర్రి బాగుల బాపనయ్య గనుక కనీసం అటు తిన్నగా చూడనైనా చూడకుండా, 'రామరామ, శ్రీహరీ' అనుకొంటూ ఓరమోము పెట్టి ఆమె భుజముల మాత్రమే 'అంటి', అంటే అలా అలవోకగా తాకి, ముట్టుకొని, ఫోఫో అని 'త్రోచె' నట. బ్రాహ్మణుడు గనుకనే ఓరమోము పెట్టి, అటువంటి సందర్భంలో గూడా మడిగట్టుకొని వుండగలిగాడని చెబుతున్నాడు. ఇదంతా నిజమా? జరిగే పనేనా? అలా ఎవరయినా ఉప్పూ కారం తిన్నవాడు ఊరుకొంటాడా? అంటే కర్మ ధారయాన్ని ఆశ్రయించి, 'కలంచునే సతుల మాయల్ ధీర చిత్తంబులన్' అని సరిపెట్టి, సమర్థించాడు. వరూధిని చేసినదంతా సతుల మాయ. ప్రవరుని ప్రవర్తన అంతా ధీరచిత్తుని ధీ వ్యవహారం అన్నాడు. సరస సాహితీ చమత్కారోక్తి ప్రవీణుడు పెద్దన.

ఆయన అల్లిక ఈ రోజు వరకూ

**జరిగిన కథ**

వి.సి. ఖాండేకర్ మహాభారతంలోని చిన్న ఉపాఖ్యానమైన యయాతి కథలో కొన్ని మార్పులు చేశారని ఇంతకు ముందే తెలుపబడింది. రామాయణ మహాభారతాల కథలకు భాస, దిఙ్నాగాది సంస్కృత నాటక కవులేగాక కాళిదాసు కూడా అభిజ్ఞాన శాకుంతలంలో మార్పులు చేసిన సంగతి విద్వాంసులకు విదితమే. నిన్న మొన్న మరాఠీలో పౌరాణిక నాటకాలు రాసిన వారు కూడా మార్పులు చేశారు. 'విద్యాహరణ్' మరాఠీలో ఖాడిల్కర్ రాసిన సుప్రసిద్ధ నాటకం. కచదేవయానుల ప్రణయం అందలి ఇతివృత్తం. దేవయాని పాత్రను పోషించిన బాలగంధర్వ నటనకు, గాయన శైలికి అనుకూలమైన మార్పులు చేశాడు ఖాడిల్కర్.

ఇంద్రపదవిని అధిష్టించిన నహుషుడు ఇంద్రాణిని మోహించాడు. ఆ సంగతి గ్రహించి గాభరాపడిన ఇంద్రాణి దేవ గురువు బృహస్పతిని ఆశ్రయించింది. అతని సలహా ప్రకారం తన దగ్గరికి బ్రహ్మరధం మీద రావలసిందిగా కబురు చేసింది. బ్రహ్మరధ మంటే బ్రహ్మర్షులు మోసే పల్లకీ. దేవరాజు ఆజ్ఞ మేరకు బ్రహ్మర్షులు పల్లకీ మోశారు. కాని తపః కృశులయిన ఆ మహర్షులు వేగంగానడువలేక పోయారు. కామాతురుడైన నహుషుడు విలంబాన్ని సహించలేక "త్వరగా" సర్ప, సర్ప" అని వాళ్ల శిరస్సులను కాలితో పొడిచాడు. అగస్త్య మహర్షి ఆగ్రహించి "ఒరే కామాంధా! నువ్వొక పెద్ద సర్పాని వై పో" అని శపించి పల్లకీ వదిలి పెట్టాడు. దీర్ఘకాలం అడవిలో అజగరమై పడివున్న నహుషుడు తానడిగిన ప్రశ్నలకు ధర్మరాజు సదుత్తరాలిచ్చినందు వలన శాప విముక్తుడయ్యాడు. ఇది మహాభారతంలోని కథ. నహుష ప్రశ్న లనే మాట అందరికి తెలిసిందే.

**ఈ శాపవృత్తాంతాన్ని ఖాండేకర్ మార్చాడు."నహుషుడు, వీని సంతానం ఎన్ని సుఖాల మధ్యనువ్నా ఎన్నడూ సుఖించలేరు" అని అగస్త్యుడు శపించినట్లు రాశారు. ఇదే సమంజసంగా ఉన్నది. పరాక్రమ శౌర్యాల వలన పదోన్నతి. భోగలాలసత, అధికార ధన మదం వలన పతనం. అధికారము, ధనము, వాటివలన కలిగే భోగలాలసత, అహంకారం ఈ నాలుగూ అమరిన వాళ్ళు, వాళ్ల కుటుంబ సభ్యులు అన్నీ వుండీ ఎన్నటికీ నిజమైన సుఖాన్ని అనుభవించలేక పోవటం ఇప్పటికీ చూస్తున్నాము.ఇలాంటి వాళ్లంతా శపితులే.**

మహాభారతంలో దానవ గురువైన శుక్రాచార్యుడు రాక్షసులు యుద్ధంలో మరణించిన దానవులను పునర్జీవితులను చేసే సంజీవని విద్యను సాధించి నందున దేవతలకంటే దానవుల బలం పెరిగి పోయింది. దేవతల కోసం దేవగురువైన బృహస్పతి కొడుకు కచుడు శత్రు రాజ్యంలో ప్రవేశించి శుక్రాచార్యుని శిష్యుడవుతాడు. శుక్రాచార్యుని ఏకైక పుత్రిక, సౌందర్యరాశి, మాతృవిహీన దేవయాని కచున్ని ప్రేమిస్తుంది. కచుడూ వయసులో వున్నవాడే కనుక ఆమెను ప్రేమిస్తాడు. కాని కర్తవ్యజ్ఞానం గల కచుడు విద్య సాధించటం ముఖ్యంగా భావించి తన ప్రేమను అదుపులో ఉంచుకుంటాడు. దానవులతన్ని మూడు సార్లు చంపినా తన గారాబు కూతురు ప్రార్ధనను మన్నించి శుక్రాచార్యుడు కచుణ్ణి మూడుసార్లు బ్రతికించి చివరికి తన విద్యను కోల్పోతాడు. సంజీవని విద్యను గ్రహించిన కచుడు దేవయాని ప్రేమను తిరస్కరించి దేవలోకం వెళ్లి పోతాడు. మళ్ళీ అతని ప్రసక్తి రాదు.

నహుషుని పెద్ద కొడుకు యతి తండ్రి పతనాన్ని, అతనికి కలిగిన శాపాన్ని తెలుసుకొని ఐహిక భోగాల పట్ల విరక్తుడై అరణ్యాలకు వెళ్లిపోయి బ్రహ్మజ్ఞాన సిద్ధికై ప్రయత్నిస్తాడు. అతడు మళ్లీ మనకు కనిపించడు.

కాని ఖాండేకర్ రచించిన ఈ 'యయాతి' నవలలో కచుడూ, యతి చివరి దాకా ముఖ్య పాత్రల

# దేవయాని

మూలం : జ్ఞానపీఠ అవార్డు గ్రహీత ఖండేకర్ సమీక్షకుడు : ఎస్. సదాశివ

ఈ కచుడు నాకు పూర్వ జన్మ శత్రువా యేమి? ఎంత ఘనంగా జరిగింది యజ్ఞం! చివరి క్షణాన అకస్మాత్తుగా ఆకాశాన్నుంచి ఊడిపడ్డట్లు వచ్చి అంతా రసాభాస చేసివేశాడు కదా!

"ఋషి కుమారు డెవడూ నిన్ను పెళ్ళిచేసుకోడు!" అని శపించి వెళ్ళాడు. 'నీ శాపం వలన దేవయానికి ఇసుమంతయినా నష్టం వాటిల్లలేదు. కుబేరుని కన్ను కుట్టేంతటి ఐశ్వర్య వైభవాలతో తులతూగుతున్న దిప్పుడు. నీ కుటీరంలో చాకిరి చేయాల్సిన దేవయాని ఇక్కడ మహారాణిగా సింహాసనంమీద విరాజిల్లుతున్నది.' అని అతనికి తెలియ పరచాలని, అతడు లజ్జితుడై క్షమాపణ వేడుకోవాలని ప్రత్యేకంగా ఆహ్వానపత్రం పంపించాను.

వెంటే ఉంటారు. అంగిరసుడు చేసే విశ్వశాంతి యజ్ఞం ఖాండేకర్ కల్పనే. సంజీవని కంటే గొప్ప శక్తిని సంపాదించటానికై శుక్రాచార్యుడు శంకరుణ్ణి గురించి మళ్ళీ తపస్సు చేయటం కూడ ఖాండేకర్ కల్పనే. శుక్రాచార్యుడు సాధించేవి విధ్వంసక శక్తులు. తపస్సు ద్వారా గొప్ప శక్తులు, మహిమలు సంపాదించిన ఋషుల గురించి పురాణాల్లో కథలు కథలుగా చెప్పారు. అలాంటి ఋషుల్లో చాలా మంది సైంటిస్టులే. ఈ నాడు ల్యాబరేటరీల్లో కూర్చుండి పరిశీలనలు, పరిశోధనలు చేస్తున్న సైంటిస్టుల లాగా ఆనాడు ఋషులు తపస్సమాధిలో కూర్చుండి ప్రకృతి రహస్యాలు దర్శించేవాళ్ళు. దర్శనాలు వాళ్ళ తపఃఫలంగా మనకు దొరికినవే. శుక్రాచార్యుడు, విశ్వామిత్రుడు, కపిలుడు, కణాదుడు, ధన్వంతరి లాంటివాళ్ళు కేవల ఋషులు కారు. సైంటిస్టులు కూడా. 50 ఏళ్ళ క్రిందటి ఈ పత్రిక సంపాదకులు రాసిన వ్యాస మొకటి డిసెంబరు 1995 మిసిమిలో వచ్చింది. అందులో వారు చెప్పినట్టు శంకురుడు సంగీత, నాట్య, వ్యాకరణాది కళా సాహిత్యాలకే కాక లోక కళ్యాణ కారకాలయిన సిద్ధుల్లోనూ, విధ్వంసక సిద్ధుల్లోనూ అందరి కంటె గొప్పవాడు. అతడు ప్రకృతిని (గౌరిని) స్వాధీన పరచుకున్నవాడు. దేవతలతనికి భయపడే తమలో చేర్చుకొని మహాదేవుణ్ణి చేశారు.

గత సంచికలో యయాతి బాల్యం, యౌవనం, దిగ్విజయ యాత్ర ఆ సందర్భంలోనే మంత్ర తంత్ర సాధనలో మునిగివున్న యతి దర్శనం, అంగిరస మహర్షి తలపెట్టిన విశ్వశాంతి యజ్ఞ రక్షకుడుగా వెళ్లిన యయాతికి కచుని పరిచయం, నహుషుని మరణం, శుక్రాచార్యుని పుత్రిక దేవయానికి దానవరాజు వృషపర్వుని పుత్రిక శర్మిష్ఠ మధ్య రగులుతున్న మత్సర ద్వేషాలు, శర్మిష్ఠ తన చెలికత్తెలతో కలిసి దేవయానిని పాడుబడిన బావిలో తోసి వెళ్లిపోవటం మహారాజు ఆమెను బావిలోంచి వెలుపలికి తీసి పాణిగ్రహణం చేసుకోవటం, మద్యపానం కారణంగా మొదటి రాత్రే దంపతులు కలహించుకోవటం వరకు కథ సాగింది. ముగ్గురు ముఖ్యపాత్రలు- యయాతి, దేవయాని, శర్మిష్ఠ చెప్పుకునే ఆత్మకథ యిది. ఈ సంచికలో తర్వాతి కథ చెప్పబడింది. ఇంకోనెలలో ఈ కథ సమాప్తమవుతుంది.

'మహారాణిగా నన్ను చూడడటం అతనికి ఇష్టం ఉండదు. అతడు రాడు.' అనే అనుకున్నాను. అయినా, ఒకనా డతడు నాపట్ల ప్రదర్శించిన ప్రేమ ఎంత గాఢమయిందో తెలుసు నాకు. అతడా ప్రేమను త్యాగం చేశాడు. కాని మరిచిపోవటం శక్యమా? 'అతడు వస్తాడు - తప్పక వస్తాడు' అని నా మనస్సు చెబుతూనే వున్నది. కాని యజ్ఞ ప్రారంభంలో అతడు రాలేదు. సమాప్తమయ్యే టప్పుడూ రాలేదు. నాలోని మహారాణి సంతోషించింది. నాలోని దేవయాని మాత్రం దుఃఖించింది. వీడ్కోలు సభ జరుగుతుండగా అతడు వచ్చాడని అమాత్యుడు చెప్పినప్పుడు నా సంతోషం మిన్నుముట్టింది. చూస్తాడిక - మహారాణిగా సింహాసనం మీద కూర్చున్న నన్ను, నా వైభవాన్ని, లావణ్యాన్ని చూస్తాడు. నా ప్రేమను తిరస్కరించి పోవటం ఎంత తప్పయిందో గ్రహిస్తాడు. నా ప్రతీకార వాంఛ తీరుతుంది.

కాని ఈ కచుడు నా ప్రేమను నిష్ఫలం చేశాడు. నా ప్రతీకార వాంఛనూ నిష్ఫలం చేశాడు.

ఆ వెఱ్ఱివాణ్ణి చూడగానే అత్తగారూ, మహారాజూ ఎంత వెఱ్ఱివాళ్ళలా ప్రవర్తించారు! అత్తగారయితే అన్ని మర్యాదలూ మరిచి రాజసభలోకి వెఱ్ఱిదానిలా పరుగెత్తుక వచ్చింది. " యతీ! నా యతీ!" అంటూ సభలోనే మూర్ఛపోయింది. కచునికి అత డెవరో తెలియదు. ఎక్కడో దీనస్థితిలో కనిపించి వుంటాడు. కరుణామయుడైన కచు డతన్ని తనవెంట పెట్టుక వెళ్తూ ఇక్కడికి వచ్చి వుంటాడు. అత్తగారికి అత డెవరో తెలియదు. తెలిసిన మహారాజు సమయ సందర్భాలను గుర్తించి అలాగే వుంటే సరిపోయేది గదా! "ఈ సింహాసనం అతనిదే. అతడు నా అన్న" అంటూ సభలో ప్రకటించాడు. ఈ వంశానికి వెఱ్ఱితనం వరదానంగా దొరికిందాయేమి?

ఈ వెఱ్ఱివా డిక్కడే వుంటాడో యేమో? అత్తగారు కూడా అతని పేరనే రాజ్యం చేయాల్సిందిగా ఆజ్ఞాపించవచ్చు. నన్ను మహారాణిగా చూడటం ఆమెకు కంటకంగా వున్నది కదా. మా వెఱ్ఱి మహారాజేమో హస్తినాపుర సింహాసనంమీద ఆ వెఱ్ఱివానిదే అధికారమని సభలోనే చాటి చెప్పె. ఈ వంశమే.....

.....................

ఈవంశానికి వెఱ్ఱితనం మాత్రమే కాదు. స్త్రీ వ్యామోహం కూడా వరదానంగా దొరికింది. మామామగారు ఇంద్రుణ్ణే పరాభవించారు. కావచ్చు. ఇంద్రాణి సౌందర్యానికి వ్యామోహితులై శాపం తెచ్చుకున్నారట. అత్తగారు ఇదంతా నాముందు దాచి ఉంచారు. కాని ఈ దాసీలు సామాన్యులా? ఒక వృద్ధ దాసిని నావైపు మరల్చుకున్నాను. మొదటినాడే చెప్పిందీ సంగతి. చాలా విషయాలు చెప్తుందది. నా గూఢచారిణిగా మారింది.

ఆలాంటి నహుష మహారాజు పుత్రులు వీళ్ళు. ఆ యతి నిండు సభలో జటాజూటాలూ, కాషాయ వస్త్రాలూ ధరించిన వాడు శర్మిష్ఠ వైపు పిచ్చి చూపులు చూస్తూ "ఈమెను నాకిస్తావా?" అన్నాడు. అతని వెఱ్ఱి యేలాటిదో అక్క డున్న వాళ్ళు గ్రహించలేదా? అతణ్ణి పరిహసించి ప్రయోజన మేమిలే. పాపం, చిన్నప్పటినుంచి అరణ్యాల్లో పెరిగిన వాడు. ఇంతటి పరాక్రమవంతుడు, దిగ్విజయం చేసి, అశ్వమేధయాగం చేసి మహారాజుగా సింహాసనాన్ని అలంకరించిన మా యయాతి మహారాజు ఏమి చేశాడు? ఎక్కడో అడవిలో, పాడుబడిన నూతిలో పడివున్న నన్ను పైకి తీశాడు. నా సౌందర్యానికి వెఱ్ఱివాడయ్యాడు. పురుషుని కళ్లలో చూచి స్త్రీ గ్రహించగలదు - అతడు కాముకుడో కాడో అనే విషయం. అతని కళ్లలో పిచ్చికామం కనిపించింది. అత డెంతటి స్త్రీలోలుడో అప్పుడే గ్రహించాను. పైదాకా వచ్చిన దాన్ని "నాకు భయంగా వున్నది. నా చేయి పట్టి వెలుపలికి తీయండి." అని ఊరికే అన్నానా? బావిలోంచి బయటికి వచ్చాక ఎంతటి ఆకలి చూపులతో చూశాడు నన్ను!

అదే కచుడై వుంటేనా? "నా చేయిపట్టి..." అనే సాహసం నేను చేసి వుండేదాన్ని కాదు. ఒకవేళ అన్నా, "ఇదుగో, నూతిలో పడ్డ నిన్ను పైదాకా తెచ్చాను. నా ధర్మం నేను నెరవేర్చాను. పైకి వస్తావా రా, లేదా, మళ్లీ బావిలో పడిపో. అది నాకు సంబంధించింది కాదు." అని తనదారిన తాను వెళ్లిపోయేవాడు.

కచుని పట్ల నా మనస్సు అంతగా ఆకర్షిత మవటానికి కారణ మదే మరి. ఆశ్రమానికి వచ్చినప్పటినుంచి నా వెంట తిరుగుతూ, నన్ను స్పృశించే అవకాశాలు కల్పిస్తూ, నావైపు లాలస దృక్కులతో చూస్తే నేనతని వైపు చూసేదాన్నే కాదు. అతని చూపుల్లో నా కేనాడూ లాలస కల్పించలేదు. అతని ప్రవర్తనలో కాముకత ఛాయలు లేశ మాత్రం చూడలేదు నేను. ఆలాటి పురుషులే స్త్రీలను ఆకర్షిస్తారు. తమ వెంట తిరిగే పురుషుల పట్ల విముఖత పెరుగుతుంది. చిత్రంగా అనిపించినా జరిగే దిదే.

ఒకనాడు అతని వెంట పూలకోసం తిరుగుతూ ఉండగా నా కాలికి ముల్లు గుచ్చుకున్నది. పాముకాటు వేసిందని పడిపోయాను. అతని కళ్ళలో ఉబికివచ్చిన కన్నీటి పొరను చూచాను. తెలిసిపోయింది అతడు నన్నెంతగా ప్రేమిస్తున్నాడో అనే సంగతి. మరొక నాటి రాత్రి తన గదిలో ఆదిశక్తిని ప్రార్థిస్తున్నాడు. "తల్లీ! దేవయాని ఎప్పుడూ సుఖంగా వుండేటట్లు దీవించు." అనే మాటలు వినిపించాయి. ఎంతటి మూగప్రేమ! ఆలాటి ప్రేమ దొరకాలని ఆశించాను. ఒక సౌందర్యవతిని చూడగానే కలిగే ప్రేమ అదేమి ప్రేమ? అదొక మోహం. ఏ స్త్రీ ఈలాటి ప్రేమకు తన హృదయంలో చోటీయదు.

అయితే, జీవితమంతా భగ్నప్రేమను తలపోస్తూ దుఃఖించే ప్రేయసిగా మిగిలిపో దలచుకోలేదు నేను. కచుడు నా మనస్సును తీవ్రంగా గాయపరిచాడు. ఆ గాయాన్ని మాన్పించుకోవాలని దాని జ్ఞాపకాలనే విస్మరించాలని నాలోని ప్రేయసిని మనసు అట్టడుగున శాశ్వతంగా అణచివేశాను. అధికార గర్వంలో అన్నీ మరచిపోవాలని నిశ్చయించుకున్నాను. శర్మిష్ఠ నన్ను బావిలో పడద్రోయటం, అంతలోనే యయాతి మహారాజు రావటం జరిగాయి. అతడు హస్తినాపుర మహారాజని తెలియగానే నేను మహారాణిని కావాలని అప్పుడే ఆలోచించాను. భగ్న ప్రేమను మరచి పోవటానికి వైభవం, అధికార దర్పం, ఎప్పుడూ కనుసన్నల్లో మెలగుతూ ఆడించినట్లు ఆడే భర్త కావలసివుంది. అన్నీ అమిరాయి. స్త్రీలోలురైన పురుషులే భార్య చేతిలో కీలు బొమ్మలా ఆడగలరు. యయాతి మహారాజు ఆలాటివాడే. ఒక్క క్షణంలో నాకు కావలసిన వన్నీ లభించాయి. కాని కచుని వెంట వచ్చిన ఆ పిచ్చి సన్న్యాసి - మా బావగారు - హస్తినాపుర సింహాసనానికి అధికారి - అంటే?

ఇంతవరకు దేవయాని స్వగతం విన్నారు. ఆమె మాటల వలన మహారాణి పదవిని ఆమె ఎట్టి పరిస్థితుల్లోనూ వదలుకోదనే అంశం స్పష్టమైంది. భార్యా దాసుడైన భర్తే ఆమెకు బలం. రాజమాత కూడా హఠంలో తనకంటె తక్కువ కాదని గ్రహించింది. కనుక, క్షత్రియ పక్షపాతం గలదని గ్రహించింది. కనుక శర్మిష్ఠమూ, యతికీ వివాహం జరిపి తన భర్తను యతి ప్రతినిధిగా రాజ్యపాలన చేయిస్తుందేమో అనే భయం పట్టుకున్న దామెను. స్త్రీలోలుడైన యయాతి భార్యా వియోగాన్ని సహించలేడు. శుక్రాచార్యుడు ఏప్పుడు శపిస్తాడో అనే భయం అతనిని అంటిపెట్టుకొనే వున్నది. అసలే శపితుడాయె. ఈ రెండు బలహీనతలను ఉపయోగించుకొని, తలమీద బూది చల్లుకొని తండ్రి దగ్గరికి వెళ్తానని బెదిరించింది. బెదిరి పోయిన యయాతి యతిని రాజప్రాసాదంలో కాక, అశోక వనంలో వుంచటానికి ఒప్పుకున్నాడు. ప్రతిష్ఠకు విలువ యిచ్చే రాజవంశమాయె. వెఱ్ఱివాడు రాజభవనంలో వుంటే తన వెకిలి చేష్టల వలన దాసీ జనాన్ని వేధిస్తాడని రాజవంశ ప్రతిష్ఠ మంట

గలుస్తుందని ప్రచారం చేసింది. రాజమాత యతిని, శర్మిష్ఠ మొదలయిన కొందరు దాసీలను వెంట పెట్టుకొని అశోకవనానికి వెళ్లిపోయింది. ఎప్పటి కప్పుడు అక్కడి వార్తలు తెలుసుకోవటానికి తనకు నమ్మకస్థురాలైన వృద్ధ దాసిని వాళ్లవెంట పంపటం మరిచిపోలేదు దేవయాని. "ఒక్క సారైనా నన్ను అమ్మా! అని పిలువరా యతీ!" అని రాజమాత పలుమార్లు యతిని బతిమాలటం, యతి నిరాకరించటం ఆమెకు రోజూ అందే వార్తలు.

యతి హస్తినాపురంలో అడుగు పెట్టినప్పటినుంచి ఎడతెరిపి లేని కుంభవృష్టి. యమునా నది పొంగి పొరలుతూంది. పరిసర గ్రామాలు కొట్టుకుపోవటం ఖాయం. యతి వుంటే హస్తినాపుర నగరానికి ఎంత అరిష్టమో అమాత్యులకు చెప్పింది. నాలుగవ నాటి అర్ధరాత్రి ఒక ఆశ్విక భటుడు రాజ భవనానికి వచ్చి "ఋషి మహారాజ్ ఇక్కడికి వచ్చాడా?" అని మహారాణిని వినయంగా ప్రశ్నించాడు. అశోకవనంలో యతి వెంట కచుడు కూడా వున్నాడు గదా. కచుణ్ణి గురించే అడుగుతున్నా డనుకొని "కచదేవు డిక్కడికి రాలేదే! ఒంటిగా ఎటో వెళ్లటం అతనికి అలవాటే. గాభరా పడకండి." అన్నది. "కచదేవు డక్కడే వున్నాడు మహారాణీ! అతని వెంట వచ్చిన ఆ పిచ్చి సన్న్యాసే రాజ మాత గాఢ నిద్రలో వుండగా ఎటో పారిపోయాడు." అని చెప్పాడు భటుడు. మహారాజును నిద్ర లేపింది. అతడు అశ్వారూఢుడై అశోకవనానికి వెళ్ళిపోయాడు. అన్ని వైపులా సైనికులను పంపాడు. యతి జాడ తెలియలేదు. మర్నాటి ఉదయం నగరంలో రకరకాల పుకార్లు బయలుదేరాయి. నిండుగా పారుతున్న యమునా నది ఇద్దరి నుంచి అద్దరి వరకు రాచబాటమీద నడిచినట్లు నడుస్తూ వెళ్ళిన ఒక ఋషిని కళ్లారా చూశామని కొందరు చెప్పారు. యతికి ఆ సామర్థ్యం వున్నదని దేవయానికి తెలుసు. కాబట్టి తనమార్గంలోని కంటకం తొలగి పోయిందని లోలోన సంతోషించింది. దుఃఖంలో వున్న రాజమాతను పరామర్శించటానికి గాను అశోకవనం వెళ్లింది. రాజప్రాసాదానికి రావలసిందిగా ప్రార్థించింది. అదంతా నటన. "నా కిక్కడే సుఖంగా వున్న దమ్మాయి." అని రాజమాత పంపివేసింది. "కచుడు కనిపిస్తే అతనితోనూ రెండు మూడు మాటలు మాట్లాడింది. "కచదేవా! రాజభవనాని కెప్పుడు వస్తారు?" అని కూడ ప్రశ్నించింది. "చూద్దాం" అని తప్పించుకున్నా డతడు. ఆ తర్వాత వారం రోజులు అశోకవనంలో వున్నాడు కచుడు. తన బాల్య సఖుడు, తన వలన మూడు తడవలు చచ్చి బ్రతికినవాడు. తన పట్ల అవ్యాజమైన ప్రేమ గలవాడు. తన దగ్గరకు తప్పక వస్తాడని నమ్మకంతో ఎదురుచూచింది దేవయాని. మహారాజు ప్రతి సాయంత్రం తల్లి దర్శనార్థం అశోకవనం వెళ్ళేవాడు. నాలుగైదు గడియలు గడిపి వచ్చేవాడు. "కచునితో సంభాషిస్తూ వుంటే కలిగే ఆనందం వర్ణనాతీతం. నేనూ ఋషినైతే బాగుండే దనిపిస్తుంది." అని దేవయానితో చెప్పేవాడు. అందరితో మాట్లాడటానికి తీరుతుంది కాని కచునికి తనతో మాట్లాడటానికే సమయం దొరకదని బాధ పడేది దేవయాని. అతని కోసం ఒక ఉన్నతాసనం అమర్చి, అతని కిష్టమైన పుష్పహారాలు పళ్ళెరంలో పేర్చి, అత డింతవరకు ఆస్వాదించని స్వాదిష్ట ఫలాలు అమర్చి ప్రతిదినం ఎదురుచూచేది. మర్నాడు పుష్పహారాలు వాడిపోతే మళ్లీ తెప్పించేది. ఎనిమిదవ నాడు పూర్తిగా నిరాశ చెందింది. అతడు తనకు తెలుపకుండానే వెళ్ళిపోతా డనుకున్నది. పుష్పహారాలు కాని, ఫలాలు కాని అమర్చలేదు. ఆ రోజే కచుడు ఆమెను దర్శించటానికి వచ్చాడు. అతనిని చూడగానే దాసీలు ఉన్నతాసనం కోసం పరుగెత్తారు. అంతలో కచుడు తన మృగాసనం పరచుకొని హాయిగా కూర్చున్నాడు. అతిథి మర్యాదలు చేసే అవకాశమిమ్మని దేవయాని కోరితే "అమ్మా! ఇది నా చెల్లెలి యిల్లు. నా యింట్లో నాకు మర్యాద లేమిటి? నీ అన్న అభిరుచులను ఇంకా గుర్తుంచుకొని పుష్పహారాలు తెప్పించావు. ఇది బాగున్నది. మృగాజినం మీద హాయిగా నిద్ర

పడుతోంది నాకు. ఒక్కసారి హంసతూలికా తల్పంమీద పడుకొంటినా శరీరం మళ్ళీ మళ్ళీ ఆ సుఖమే కోరుతుంది. జిహ్వా అలాటిదే. కందమూలాలు తిని బ్రతికే నేను ఒక్కనాడు నీచేతి మృష్టాన్నం తింటినా మళ్లీ అలాటి తిండే కావాలని వెంపర్లాడుతుంది జిహ్వా. కాబట్టి నా నియమాన్ని నన్ను పాటించనీ. ఇక నీ సంగతా? నువ్వు మహారాణివి. గృహిణివి. నువ్వనుభవించాల్సినవి అనుభవించటమే నీ ధర్మం.'' ఇన్ని మాటలు చెప్పినతర్వాత తాను దేవయానిని శపించినందుకు క్షమించవలసిందిగా చేతులు జోడించడాడు. "అలా శపించటం అన్నగా చేయగూడని పని. ఋషి కుమారుడుగా చేయగూడని పని.'' అని పశ్చాత్తాపం వ్యక్తం చేశాడు. "ఇంతవరకు నిన్ను ఏదీ అడుగలేదు నేను. నేనొక భిక్ష వేడుతున్నాను, అన్నమాటను మన్నిస్తావని నమ్ముతున్నాను.'' అన్నాడు. 'ఏమిటో అడుగు' అంటే "శర్మిష్ఠ దాస్య విముక్తి" అన్నాడు. దేవయానికి కోపం వచ్చింది. ''శర్మిష్ఠను దాసిగా కాక మహారాణిని చేయుమంటావా? నా సవతిని చేనుకొని నెత్తినెక్కించుకొమ్మంటావా? నన్ను ఆమెదాసిగా మారమంటావా?'' అని తీవ్ర స్వరంతో ప్రశ్నించింది. కచుని శాంత ముద్ర ఏ మాత్రం మారలేదు. "ఏదో కోపంలో దాసిగా చేసి వుంటావు. అది తప్పనను చెల్లీ! కోప తాపాలు అందరికీ సహజమే. కాని వాటిని నిలుపుకోవటం గొప్పకాదు. క్షమించి మనస్సును నిర్మలం చేసుకోవటం మానవ ధర్మం.'' అన్నాడు- దేవయాని లాంటి పట్టుదల గల వ్యక్తికి ఆ ధర్మ ప్రవచనాలు రుచించవు. "సోదరీ! కోప్పడక నా మాట విను. ఇతరులకు జరిగిందే తనకు జరిగితే ఎలా వుంటుందో అని ఆలోచించే వాళ్ళే మనసున్న వాళ్లు. నువ్వే ఒక వేళ దాసిగా మారి వుంటే...' ' దేవయాని కోపం తారస్థాయికి చేరింది. "నేను దాసిగా మారటమా? శుక్రాచార్యుని కుమార్తెను నేను ఈ శర్మిష్ఠకు దాసిగా మారటమా?'' అని గర్జించింది. కచుడు అదే శాంత స్వరంతో, "విధిలీలలు విచిత్రమమ్మా! విధి చాల క్రూరమైంది. ఒక్క క్షణంలో రాజు పేద కావచ్చు - పేదరాజు కావచ్చు. '' అని ఇంకా ఏదో చెప్పబోతుంటే దేవయాని ఇక చాలు అన్నట్లు లేచి నిల్చున్నది. కచుడూ లేచి వెలుపలికి వెళ్తూ "నేను అన్ని విధాలా అపరిపూర్ణంగా వున్నాను. భృగు పర్వతం మీద తపస్సు చేసుకోవటానికి వెళ్తున్నాను. మళ్లీ మనం ఎప్పుడు కలుసుకుంటామో, ఏ స్థితిలో కలుసుకుంటామో దైవానికే తెలుసు. ఆదిశక్తి మహారాణికి సద్బుద్ధిని, దేవయానికి సర్వసుఖాలను ప్రసాదించుగాక అని ప్రార్థిస్తున్నాను.'' అని వెళ్ళిపోయాడు.

అతని వెంట రాజమాత కూడా భృగు పర్వతానికి వెళ్తా నన్నది. కొడుకు కన్నీళ్ళతో ఎంత వేడుకున్నా ఆగ దామె. "రోగికి అన్నం సహించదు. బలవంతంగా తినిపిస్తే వికటిస్తుంది. నాకీ సంసారం సహించటం లేదు. వెళ్ళనీ.'' అని వెళ్లిపోయింది.

కొన్ని రోజులకు కచుని లేఖ వస్తుంది. చాల దీర్ఘమైన లేఖ. ప్రత్యక్షర రమణీయమైన లేఖ. ఆ లేఖ దేవయానికి రుచించకపోవటం సహజమే.

గర్భవతిగా వున్న దేవయానికి కోరకముందే కావలసిన వన్నీ అమరేటట్లు ఏర్పాటు చేశాడు యయాతి. మళ్ళీ మహారాని మనోరంజన కోసం నాటక ప్రదర్శనలు. "మీరు నావెంట ఋషి వేషంలో యమునా విహారం చేయాలె. '' అని కోరిం దామె. మహారాజు తప్పించుకునే ప్రయత్నం చేశాడు. "మీకు నాపట్ల నిజమైన ప్రేమ లేదు.'' అని అలిగింది. యయాతి లాంటి భార్యా విధేయునిపై ఆ మాట బ్రహ్మాస్త్రంలా పనిచేస్తుందని ఆమె నమ్మకం. యయాతి అంగీకరించాడు. ఈ మర్మం తెలిసిన నావికుని వెంట భార్యాభర్తలు నౌకా విహారం చేశారు. "నేడు నాకు గర్వంగా వున్నది'' అన్నది దేవయాని. "ఎందుకు?'' అంటే "మీరొకనాడు నే నెన్నటికీ సన్యాసిని కానని మా

తల్లికి మాటిచ్చాను అన్నారు. నేడు సన్న్యాసి వేషంలో వున్నారు." అని విజయ గర్వంతో నవ్వింది. యమునా తీరానికి అశోకవనం దగ్గరే. మహారాజు వద్దు వద్దంటున్నా రథాన్ని అశోకవనం వైపు మళ్లించింది. రథం ఆగగానే ఇద్దరు సేవకులు వెలుపలికి వచ్చారు-

"నేడొక గొప్ప మహర్షి రాజభవనానికి వేంచేశారు. వారి పవిత్ర దర్శన భాగ్యం శర్మిష్ఠకు లభించాలని నా కోరిక. వీరిని సగౌరవంగా శర్మిష్ఠ గదికి చేర్చి దర్శనం చేయించండి. నాలుగు గడియల తర్వాత వీరికోసం వస్తాను నేను." అని చెప్పింది. సేవకులముందు ఏమీ మాట్లాడే అవకాశం లేనందున యయాతి వారివెంట లోనికి నడిచాడు. "మహర్షి వేషంలో వున్న మహారాజును శర్మిష్ఠ ఎలాగూ గుర్తు పట్టజాలదు. భక్తితాత్పర్యాలతో సేవించుకుంటుంది పిచ్చిది." అని తన తెలివికి తాను నవ్వుకున్నది దేవయాని. కాని, శర్మిష్ఠను పరిహసించాలనే అహంకారంతో తన భర్తను ఆమె పరం చేసిన సంగతి గుర్తించలేకపోయింది పాపం! పిచ్చిది.

★ ★ ★

మూడు మాసాలు గడిచి పోయాయి. శుక్రాచార్యులు గుహ వెలుపలికి వచ్చే దినం ఆసన్నమయింది. తండ్రిని చూడాలనే ఉత్కంఠ. మహారాజు అనుమతితో తండ్రి దర్శనానికి వెళ్ళింది దేవయాని. శుక్రాచార్యుల ఆరోగ్యం బాగానే వున్నది కాని ఆమె ఆరోగ్యమే దెబ్బతిన్నది. కొన్ని రోజులు అక్కడే వుండి పోవలసి వచ్చింది.

★ ★ ★

తిరిగి హస్తినాపురం చేరుకున్నది. నవమాసాలు నిండాయి. ఒక శుభ ముహూర్తాన మగశిశువును ప్రసవించింది దేవయాని. నామకరణోత్సవం ఘనంగా జరిగింది. తన తండ్రి పేరు పెట్టాల్సిందిగా రాజమాత వెళ్లేటప్పుడు యయాతికి చెప్పింది. దేవయానికి ఆ పేరు నచ్చలేదు. యయాతి పురూరవుని పేరు సూచించాడు. అదీ నచ్చలేదు. 'యదు' అని తనకిష్టమైన నామకరణం చేసింది. అందరు దాసీలలో శర్మిష్ఠకూడ కనిపించింది. ఏకాంతంలో చిక్కిపోయి వుంటుందనుకున్నది. దైన్యంగా తన కాళ్ళమీద పడి దాస్యవిముక్తికై వేడుకుంటుందనుకున్నది. విపరీతంగా జరిగిం దంతా! ఆమె నూత్న తేజస్సుతో వెలిగి పోతున్నది. ఎక్కడా దైన్య చిహ్నాలు లేవు. సుఖంగా సంతోషంగా కనిపించింది శర్మిష్ఠ. నమ్మకస్థురాలైన వృద్ధదాసి ద్వారా ఆమెకు నెలతప్పిందని కూడ తెలుసుకున్నది. అంటే శర్మిష్ఠ వ్యభిచారం చేసిం దన్నమాట - రాజవంశంలో పుట్టి ఎవరితోనో ఎలా వ్యభిచారం చేసి వుంటుంది? పాపం దాగదు. గర్భిణి చిహ్నాలు కన్పిస్తూనే వున్నాయి. క్షమించరాని నేరం చేసింది. మళ్లీ శర్మిష్ఠను పిలిపించింది. దాసీ లందరిని పంపివేసింది. గదిలో ఇద్దరే మిగిలారు.

"ఏమి సేవ చేయమంటారు?" అడిగింది శర్మిష్ఠ. " కళ్ళెత్తి నా వైపు చూడు." అన్నది దేవయాని. ఆమె తనవైపు చూడగానే "నీ తలిదండ్రుల పాదాల సాక్షిగా చెప్పు. నీకు నెల తప్పింది. ఔనా?" అని అడిగింది. కాసేపు మౌనంగా వుంది, "ఔను" అన్నది శర్మిష్ఠ. "నువ్వు వ్యభిచరించావు." అని గర్జించింది దేవయాని. "నేను వ్యభిచరించేదాన్ని కాను. ఒక మహర్షి అనుగ్రహం వలన..." మాటను మధ్యలోనే తుంచివేసింది "మహర్షి అనుగ్రమం వలన గర్భమయిందా? ఎవరా మహర్షి? కచుడు కాదు గదా!" అని ఎత్తిపొడిచింది.

శర్మిష్ఠ ఉలుకలేదు. పలుకలేదు. అదరలేదు. బెదరలేదు. అదే ధైర్యంతో శిలా ప్రతిమలా నిల్చుండిపోయింది.

# యయాతి

"ఏకాంతంలో భార్యాభర్తలు కలుసుకునే మొదటి రాత్రి. ఆ సమాగమం ఎంతటి ఉన్మాద కరం! ఎంత రహస్య పూర్ణం! ఎంతటి కావ్యమయం! జీవిత మంతా మరపు రాని మధురానుభూతి అది. రెండు నదుల ప్రణయాలింగనం - భూమ్యాకాశాల మధుర చుంబనం.

"సంధ్యాసమయ మయింది. దీపోత్సవాన్ని తిలకించటానికి గుమిగూడిన జన సందోహం వైపు చూస్తూ రాచమహలు పిట్టగోడ నానుకొని చాలాసేపు నిల్చున్నాను. పైకి చూస్తే మిణుకు మిణుకు మంటూ చుక్కలు ఒక్కటొక్కటిగా కనిపిస్తున్నాయి. వాటిని చూస్తూ ఎంత సేపు నిల్చున్నానో!

"దేవయాని నాకు దగ్గరగా వున్నది. అయినా, అంతే దూరంగా వున్నది. బావిలోనుంచి వెలుపలికి వచ్చినప్పటి ఆమె రూపం, నేడు ప్రొద్దున హోమం దగ్గర సర్వాలంకారశోభితయై, కించిత్తు లజ్జతో అవనతముఖియై నా సరసన కూర్చున్నప్పటి ఆమెరూపం, అన్నీ నా మనసులో కదలాడుతున్నాయి. ఇన్నాళ్లుగా ఆ సౌందర్యాన్ని మనసు నిండా త్రాగినా తృప్తి కలగటం లేదు. ఆ రూపా లన్నిటికి ఆవల వుండే దేవయాని కావాలె నాకు. ఒక్కోక్షణం ఒక్కోయుగంలా గడుస్తోంది. మిత్రుడు మాధవుణ్ణి పిలిపించుకొని, అతని వెంట అతనింటికి వెళ్ళి కొన్ని గడియలు సరదాగా గడిపి వచ్చాను. ఏదీ రుచించటం లేదు. మనస్సు దేవయాని వైపు లాగుతున్నది. మహలులో ప్రవేశించి ద్వారం మూసి వేశాను. రంభను సైతం సిగ్గుపడేట్లు చేసే సౌందర్యంతో శయ్యపై ఒరిగి కూర్చున్న దేవయానిని చూచి మనస్సును నిలువరించుకోలేక తమకాన సమీపించాను."

నూత్నదంపతుల మధ్య ఎలాటి మధుర సల్లాసం జరుగవచ్చునో ఊహిస్తూ వెళ్లిన యయాతికి ఊహించని ఎదురు దెబ్బ తగిలింది. అతడు సమీపించగానే కోపంగా లేచి నిల్చున్న దామె. అత్తా కోడళ్ల మధ్య షష్టాష్టక మన్న సంగతి అతనికి తెలుసు. అత దేనాడూ జోక్యం చేసుకోలేదు. రాజవంశపు ప్రతిష్ఠకు ప్రాధాన్యమిచ్చే రాజమాతకు రాచమహల్‌లో ఎలా ప్రవర్తించాలో తెలియని బ్రాహ్మణకన్య హఠమూ, అహంకారపూరితమైన ప్రవర్తనా నచ్చక పోవటం సహజమే. ప్రపంచంలో తన తండ్రితప్ప ఇంక గొప్ప వాళ్లెవరూ లేరని, తనలాంటి అందగత్తె ఎవరూ లేరని గర్వించే దేవయానికి అత్తగారి క్షాత్రదర్పం నచ్చక పోవటమూ సహజమే. అది అత్తా కోడళ్ల వరకే పరిమితమై వుంటుందనుకున్నాడు యయాతి. ప్రథమ సమాగమం నాటి రాత్రే తన మీద ఆ కోప మెందుకో అర్థం కాలేదతనికి - సరస సంభాషణతో ఆమెను ప్రసన్నురాలిగా చేసుకోవాలను కున్న ప్రయత్నా లన్నీ విఫలమయాయి. చివరికి "నిన్నెవరేమన్నా అన్నారా? అవమానించారా?" అని ప్రశ్నించాడు దేవయానిని. "ఔను, నన్ను మీరే అవమానించారు. ఈ సమాగమ శుభ సమయాన సురాపానం చేసి వచ్చారు. దాని వాసనే సహించదు నాకు" అన్న దామె. మిత్రుడు మాధవుడు తన కెవరో కానుకగా యిచ్చారని శ్రేష్ఠమైన మాధ్వీరసం నాముం దుంచాడు. అతని మనసు నొప్పించలేక కొంచెం పుచ్చుకున్నాను. అది సుర కాదు. మద్యం కాదు" అని సంజాయిషీ యిచ్చుకొన్నాడు. సురకు ఎన్ని పేర్లున్నవో అవన్నీ నాకు తెలుసు. మా తండ్రి ఒకప్పుడు సురాపాన లాలసుడు. దాని మూలంగానే సంజీవని విద్యను కోల్పోయాడు. ఆ నాటినుండి తాను మానుకొని దాని వాసన సహించడు - 'అతడు' కూడా సురాపానానికి విరోధే. " అన్నది ఆవేశంగా దేవయాని. 'అతడు' అంటే ఆమె అభిప్రాయం కచుడని. కచ దేవయానుల ప్రేమ గురించి వినివున్నాడు యయాతి. సూక్ష్మమైన మాత్సర్యరేఖ అతని మనసును తాకింది. " ఇది శుక్రాచార్యుని ఆశ్రమం కాదు. కచుని పర్ణకుటీరమూ

కాదు. నేను మహారాజును. ఎవరి శాసనానికీ బద్ధుణ్ణికాను. నువ్వు బ్రాహ్మణ స్త్రీవి కావచ్చు. నేను క్షత్రియుణ్ణి. క్షత్రియులకు సురాపానం నిషిద్ధం కాదు. ఇది నా రాజప్రాసాదం. ఇక్కడ నువ్వు శుక్రాచార్యుని కూతరివైతే కావచ్చుకాని నా అర్థాంగి వన్న సంగతి మరిచిపోకు. నా సుఖాన్ని గురించి....." అని అంటూవూడగానే ఆమె మండే కళ్లతో అతని వైపుచూచి, అగ్ని బాణాల్లాంటి చూపులు విసరుతూ "అయితే మీ సుఖం మీరే చూసుకోండి." అని దయ్యం పట్టిన ఆడదానిలాగా దఢాల్న తలుపులు తోసుకొని వెళ్లిపోయింది.

ఎన్నో కలలు కన్న ప్రథమ సమాగమరాత్రి ఇలా గడిచింది. యయాతి శయ్యపై దొర్లుతూ, ఈ సంగతి తెలిస్తే రాజమాత ఎంత బాధపడుతుందో దాస దాసీ లెలా చెవులు కొరుక్కుంటారో అని విచారిస్తూ " నహుషుని సంతానం సుఖించదు." అన్న అగస్త్యుని భయంకర శాపాన్ని తలపోస్తూ, ఇంకా ఆశ చావక ఏ రాత్రికైనా దేవయాని తిరిగి వస్తుందని, క్షమాపణ వేడుకొంటుందని ఎదురుచూస్తూ రాత్రి గడిపాడు.

మర్నాడు శర్మిష్ఠ ప్రొద్దున్నే అతని గదికి వచ్చి మహారాణి అస్వస్థతగా వున్నదని తెలియజేసింది. అతని ఖిన్నవదనాన్ని చూచి తలవంచుకొని "వైద్యుని చికిత్సకంటె మహారాజుగారి పరామర్శ మహారాణికి అవసరం. దాసిని, ఇన్ని మాటలు చెప్పగూడదు కాని ప్రణయ కలహాలు లేని ప్రేమ నిస్సారమని కావ్యాల్లో చదివాను" అన్నది. తనను దాసిగా మార్చితెచ్చి అడుగడుగునా అవమానిస్తున్న దేవయాని పట్ల ఆమెకు గల మంచి మనసుకు ముగ్ధుడైనాడు యయాతి.

"నువ్వు దేవయానికి దాసివి, నా దృష్టిలో రాజపుత్రికవే, అయినా నీ పట్ల అంతటి ద్వేషం పెంచుకున్న దేవయాని కొరకు నీకింత ఆవేదన యెందుకు? ఇంతటి ప్రేమ ఎక్కడ నేర్చావు?" అన్నాడు, కచదేవుని దగ్గర "అతడు ప్రేమమూర్తి." అన్నది శర్మిష్ఠ. "ప్రేమపేరు వింటేనే మూడుసార్లు తలస్నానం చేసే కచుడు ప్రేమ స్వరూపుడా? ఈమె అతనిని ప్రేమించలేదుగదా!" అని అనుమానించాడు యయాతి. ఆమె వెంట దేవయాని గదికి వెళ్లాడు. వాడిపోయిన ముఖం, అశ్రువులు జాలువారే కళ్లు. ఆస్థితిలో శయ్యమీద పడుకొని వున్న దేవయానిని చూచి చలించి పోయాడు. ఖెనుదిరిగి చూస్తే గదిలో ఎవరూ లేరు. తన కాలి అందెలు సడి చేయకుండా తలుపుమూసేటప్పుడు స్వల్ప శబ్దమైనా రాకుండా వెలుపలికి వెళ్లి పోయింది శర్మిష్ఠ. అతడు తన సరసన కూర్చోగానే పుష్పదళాల లాంటి తన మృదుహస్తాలను యయాతి చేతుల్లో పెట్టి "మళ్లీ పుచ్చుకోరుగా?" అని మందస్వరంతో గోముగా అడిగింది దేవయాని. మద్యపాన నిషేధ మన్నమాట. యయాతి మనసులో ఒక అదుపు తప్పిన గుఱ్ఱం దౌడు తీసినట్లయింది. కాని ఆమె ఆరోగ్యపరిస్థితి చూచి సారథి అతికష్టంగా ఆ గుఱ్ఱం కళ్లెం బిగించి పట్టుకొన్నాడు. 'మళ్లీ నీ ముందు పుచ్చుకోను.' అన్నాడు. "అలాకాదు గట్టిగా శపథంచేసి చెప్పండి." అన్న దామె. మళ్లీ అహంకారం దెబ్బతిన్నది. గుఱ్ఱం అదుపు తప్పింది. మాటమీద నమ్మకం లేని వాళ్లతో మాట్లాడి ప్రయోజన మేమి? అయినా, నిగ్రహించుకొని " ఈ మృదు హస్తాల స్పర్శకోసం వంద శపథాలయినా చేస్తాను." అన్నాడు " మా తండ్రి మీద ఒట్టు వేసి చెప్పండి." అన్నది దేవయాని. యయాతి మనసు ఖిన్నమయింది. "ఈమె మనసులో తండ్రికే గాని భర్తకు స్థానం లేదు." అనుకున్నాడు. అయినా ఆమె చెప్పినట్లే వాగ్దానం చేశాడు. అప్పు డామె ఆనందంగా నవ్వింది. ఆ నవ్వు ప్రేయసి నవ్వు కాదు. తన మాట నెగ్గినందుకు నవ్వే మానిని నవ్వు. తన రూప లావణ్యాలతో పురుషుల నెలా వశపరచుకోవచ్చునో అది తెలిసిన

రమణి నవ్వు.

"ప్రేమ సామ్రాజ్యంలో అడుగుపెట్టిన మొదటి రోజే పూర్తిగా ఓడిపోయాను" అంటాడు యయాతి.

★ ★ ★

ఈ నవలలో అదుపు తప్పిన గుఱ్ఱం ప్రసక్తి చాలా చోట్ల వస్తుంది. క్షాత్ర విద్యలన్నీ నేర్చిన తర్వాత ఒక అదుపు తప్పిన గుఱ్ఱాన్ని చాలా సేపు స్వాధీనపరుచుకొని తరువాత దానిచేత దూరంగా విసరివేయ బడుతాడు యయాతి. అశ్వారూఢుడై అంగిరస మహర్షి ఆశ్రమానికి వెళ్లినప్పుడు కచు డతనితో "నీ ఆశ్వాని కంటే శ్రేష్ఠమైన అశ్వం నా దగ్గరున్నది. అది నా వశంలో వున్నది. దాని వేగం గాలికంటే, మనస్సు కంటే అధికం" అంటాడు. "దాని పేరేమిటి?" అంటే "ఆత్మ" అంటాడు కచుడు. కామక్రోధాలు ప్రబలమైనప్పుడు తన మనసులో అదుపు తప్పిన గుఱ్ఱం దౌడు తీస్తున్నట్లుగా యయాతి చెప్పుకొంటాడు. ఈ నవల ముఖ పత్రం మీద దౌడుతీస్తున్న గుఱ్ఱం చిత్రమే వేయించాడు ఖాండేకర్.

★ ★ ★

దేవయాని అహంకారాన్ని చూసిన మొదటి రాత్రే తా నామెను ఏ పరిస్థితుల్లో వివాహమాడవలసి వచ్చిందో మళ్లీ వివరంగా చెబుతాడు యయాతి. తన కళ్లముందే అలకకు విషమిచ్చి చంపిన తల్లికీ తనకూ నడుమ ఆకాశ మెత్తు గోడ లేచింది. ప్రతీకారవాంఛ ప్రబల మయింది. తల్లితో మాటలు మానుకున్నాడు. మృగయా వినోద సందర్భాన పాడుబడిన నూతిలోనుంచి దేవయానిని పైకి తీసినప్పుడు ఆమె స్వయంగా పాణిగ్రహణ ప్రసక్తి తేగానే అతడు దానిని సమ్మతించటానికి మూడు కారణాలు: మొదటిది - ఆమె అతిలోక సౌందర్యం. రెండవది – ఆమె మహాతపస్సంపన్నుడైన శుక్రాచార్యుని తనయ కావటం. అంతటి తపస్వికి అల్లుడై అతని అనుగ్రహాన్ని పొందగలిగితే అగస్త్యుని శాప ప్రభావాన్ని తప్పించుకోవచ్చు ననే ఆశ. మూడవది – క్షత్రియ ప్రతిష్ఠను నిల్పటానికి అలకను చంపించిన తన తల్లి మీద ప్రతీకారం తీర్చుకోవటం. క్షత్రియ కన్యను కాక బ్రాహ్మణ కన్యను వివాహమాడటం ఆమెను బాధించటానికే అయితే అతడు తల్లిని సాధించగలిగాడు తప్ప ఇంకేమీ సాధించలేక పోయాడు. దేవయాని అతిలోక సౌందర్యం చాటున అహంకారమే కాని అనురాగం లేదని తెలిసిపోయింది. తనవంటి మహారాజు అల్లుడుగా లభించినందుకు శుక్రాచార్యుడు సంతోషిస్తా డనుకున్నాడు. ఆచార్యుడు అతణ్ణి గాని నహుషుణ్ణి గాని గొప్పగా గుర్తించలేదు. తన గొప్పలే చెప్పుకున్నాడు. తన ఏకైక తనయ నెంత గారాబంగా పెంచాడో, ఆమెకు ఏ మాత్రం కష్టం కలిగించకుండా ఎంత అల్లారు ముద్దుగా చూచుకోవాలో చెప్పాడు కాని, అత్తగారింటికి వెళుతున్న కూతురుకు అక్క డెలా మసలు కోవాలో ఒక్కమాటయినా చెప్పలేదు. పైగా తన తపశ్శక్తి ఎలాంటిదో, తనశాపానికి ముల్లోకాలు ఎలా గడగడలాడిపోతాయో చెప్పి ఒక విధంగా బెదిరించాడు. దేవయానికి ఏ మాత్రం మనఃక్లేశం కలిగినా శాపం తప్పదని సూచించాడు. శర్మిష్ఠను దాసిగానే చూడాలని కూడా హెచ్చరించాడు.

యయాతి దేవయానితో చేసిన ప్రతిజ్ఞను గట్టిగా పాటించాడు. ఆ కారణంగా వాళ్ల దాంపత్య జీవితం కొన్నాళ్లు హాయిగా సాగింది. అయినా దేవయాని అతనికి ప్రేమను అందించలేక పోయింది. యయాతి వలన సంక్రమించిన మహారాణి పదవికే ఆమె విలువ యిచ్చింది. కాని యయాతికి ఎలాటి

విలువ ఇయ్యలేదు. ఆమె గూడ 'ప్రతిష్ఠ' అనే పదాన్ని ప్రయోగించిం దొకనాడు. "మన మిలా చిన్నవాళ్లలా ప్రవర్తిస్తే రాజవంశ ప్రతిష్ఠకు భంగం కాదా?" అన్నది. అలకకు విష మిప్పించినప్పుడు తన తల్లి ఆ మాటే అన్నది. " అలకలాంటి దాసికి అంతటి ప్రాముఖ్య మియ్యటం రాజవంశ ప్రతిష్ఠకు భంగకరం" అన్నది రాజమాత. దేవయాని నోట ఆ మాట వెలువడగానే అది విషాక్తమైన అమ్ములాగా చెవుల్లో దూరి గుండెలోకి దూసుకపోయింది. "రాజవంశ ప్రతిష్ఠ! రాజప్రాసాద ప్రతిష్ఠ! ప్రాణాలతో వున్న మనిషిని భూస్థాపితం చేసి సమాధిమీద అందమైన కట్టడం కట్టించే ప్రతిష్ఠ" అనుకున్నాడు. దేవయాని రెండవ తరంలో తన తల్లి ప్రతినిధే అనిపించిం దతనికి.

దేవయానికి ఎప్పుడూ యయాతి ప్రవర్తన పట్ల సందేహమే. ఎన్నడూ నమ్మలే దతణ్ణి. ఏ రకం వస్త్రాలు ధరించినా అప్సరసలా కనిపించే దామె. తన సౌందర్యాన్ని ఎలా కాపాడుకోవాలో, ఎలా ప్రదర్శించాలో ఆమెకు బాగా తెలుసు. కాని అదంతా ఆమె ఆనందం కోసమే. యయాతి కోసం కాదు. ఎప్పుడూ తనను గురించి, తన తండ్రి గొప్పతనాన్ని గురించి చెప్పుకునేది గాని నహుష మహారాజు ఇంద్రుణ్ణి పరాభవించిన విషయం ఎప్పుడు ప్రస్తావనకు వచ్చినా వినీ వినట్లుండి పోయేది.

వివాహం జరిగిన తొలి రోజుల్లో మహారాణి మనస్సును రంజింపజేయటానికి నిపుణులయిన కళాకారులు వరుసగా మూడు రాత్రులు మూడు నాటకాలు ప్రదర్శించారు. మొదటిది ఊర్వశీపురూరవ నాటకం. తనను విడిచి దేవలోకానికి వెళ్లిపోతున్న ఊర్వశి వెంట పడి పురూరవుడు పిచ్చివాడిలా పరుగెడుతూ అతి దైన్యంతో ఆగిపొమ్మని బ్రతిమాలుతుంటే, "రాజా! ఆగిపో - నా వెంట పడకు - స్త్రీల ప్రేమను అంతగా నమ్మవద్దు." అని వెళ్లిపోతుంది.

"బలేగా మందలించింది." అని దేవయాని సంతోషంగా చప్పట్లు చరుస్తూ, నవ్వుతుంటే విచార వదనాలతో నాటకం చూస్తున్న సామాజికులంతా మహారాణి వైపు వింతగా చూశారు. యయాతి తలవంచుకున్నాడు.

రెండువనాటి నాటకం అగస్త్యలోపాముద్రల గురించి. "లోపాముద్ర మూర్ఖురాలు. అలా ప్రేమ ప్రదర్శించక ఆ గడ్డాల సన్యాసిని ఊర్వశిలాగ మందలించాల్సింది" అని వెక్కిరించింది దేవయాని.

మూడవ రాత్రి నాటకంలో ఒక రాజు శత్రురాజుల రహస్యాలను తెలుసుకోవటానికి గాను నర్తకిలా మారురూపం ధరించి వెళ్తాడు. ఆ దృశ్యాన్ని చూచి, "మీరూ అలా మారురూపం ఎందుకు ధరించరు? గడ్డాలు, మీసాలు, జటాజూటాలు ధరించి ఋషివేషం వేయండి. ఆ రూపంలో మిమ్మల్ని చూడాలని వున్నది" అన్నదామె. నే నెన్నటికీ సన్న్యాసిని కాను అని మా తల్లికి మాటిచ్చాను." అంటాడు యయాతి. "ఎలా కారో చూస్తాను." అని పెద్దగా నవ్వింది దేవయాని.

"ఈ లాటి జ్ఞాపకాల్లో గర్వించ దగినదీ, సంతోషించదగినదీ ఏదీలేదు" అంటాడు యయాతి. తాను తల్లికాబోతున్నానని చెప్పిన దేవయాని మాట మాత్రం అతనికి మితిలేని ఆనందాన్ని కలిగించింది.



ఉత్తర ప్రాంతాన దస్యులు పెచ్చరిల్లి సరిహద్దు దాటి వచ్చి అక్కడి ప్రజలకు భయోత్పాతాలు కల్గిస్తున్నారనే వార్తలు వస్తున్నాయి. తాను స్వయంగా వెళ్లి దస్యులను అణచి వేయాలని సంకల్పించాడు యయాతి. ఎన్నిరోజులైనా పట్టవచ్చు - అన్ని రోజులు దేవయానిని విడిచి వుండగలనా అనుకున్నాడు. ఆమెకు మాత్రం అలాంటి దిగులేమీ వున్నట్లు లేదు. అంత పెద్ద రాజప్రాసాదంలో మహారాణి దర్జా

వెలిగించటమే ఆమెకు కావలసింది. యయాతి వునికి ఆమెకు ముఖ్యం కాదు.

ప్రయాణానికి ముహూర్తం నిశ్చయించ బడింది. విజయ తిలకం దిద్ది, విజయాక్షతలు చల్లి మహారాణి వీడ్కోలియ్యాలె. పురోహితులు మంత్రాలు చదువుతుండగా ఆరతి పళ్లెం పట్టుకొని శర్మిష్ఠ నిల్చున్నది. రాజమాత తన ఆశీస్సు లందించటానికి వేంచేసి వున్నది.

దేవయాని తిలకం దిద్దటానికి గాను శర్మిష్ఠ చేతిలోని పళ్లెరాన్ని అందుకో బోతున్నది. అంతలో ఒక భటుడు వచ్చి శుక్రాచార్యుల వారి లేఖ పట్టుకొని వచ్చిన వృషపర్వ మహారాజు భటు డొకడు బయట నిల్చున్నాడనే వార్త వినిపించారు. దేవయాని పళ్లెరాన్ని శర్మిష్ఠ చేతి కిచ్చి చిన్న పిల్లలాగా బయటికి పరుగెత్తింది. "మహారాణీ! ముహూర్తం మించిపోతున్నది". అని పురోహితు లంటున్నా వినిపించుకోలే దామె. అక్క డున్న వాళ్లంతా ఒకరి ముఖా లొకరు చూచుకున్నారు. ముహూర్తం దాటిపోతున్నది. రాజమాత ఆదేశా న్ననుసరించి శర్మిష్ఠ మహారాజుకు తిలకం దిద్ది అక్షతలు చల్లింది. అంతలో ఎలా బయటికి పరుగెత్తిందో అలాగే పరుగెత్తుతూ వచ్చింది దేవయాని. ఆమె ముఖం సంతోషంతో వెలిగి పోతున్నది. చేతిలో తండ్రి పంపిన లేఖ ఉన్నది. మహారాజు ముఖాన తిలకాన్ని చూచి, రాజమాత నుద్దేశించి "అత్తగారూ! మీరు దిగులు పడకండి. ఇదిగో ఈ లేఖలో మహా తపస్సంపన్నుడైన మా తండ్రిగారి ఆశీస్సు లున్నవి." అంటూ ఆ లేఖను యయాతి చేతి కిచ్చి అందరూ వినేట్లు చదువాల్సిందిగా కోరింది. అది పెద్ద లేఖ. అంద లో సంజీవని విద్యను పోగొట్టుకున్న శుక్రాచార్యుడు అంతకంటె గొప్ప శక్తిని పొందటానికి గాను శంకరుని గూర్చి తపస్సు చేయనున్నట్లు, తపస్సు కోసం గుహలో ప్రవేశించక ముందు తన గారాబు కూతురును చూడదలచుకున్నట్లు, వీలయితే మహారాజు కూడా రావలసింది గాను రాశాడు. శర్మిష్ఠ తన ప్రసక్తి చివరికైనా వస్తుందేమో అని, తన తల్లిదండ్రుల ప్రస్తావన వస్తుం దేమో అని ఆశతో వింటూ నిల్చుంది. లేఖ చదువటం పూర్తి కాగానే నిరాశతో తల వాల్చుకున్నది. దేవయాని లాగా తాను తన తల్లి దండ్రులకు నెలకో లేఖ పంప జాలదాయె. ఏమని రాస్తుంది? దాసిగా తాను సంతోషంగా వున్నాననా? యయాతి ఆమె ముఖకవళికలు గమనిస్తూ ఒక నిట్టూర్పు విడిచాడు. ఆ నిట్టూర్పు తాను వెళ్లి పోతున్నందుకే అని భావించిన దేవయాని,"ఎందుకా విచారం? మా తండ్రిగారు గుహలో ప్రవేశించగానే తిరిగి వస్తాను గదా! " అని ఓదార్చింది. పురోహితులు బయలుదేరవలసిన ముహూర్తం మించి పోతుందంటున్నా దేవయాని తాను తలపెట్టిన యజ్ఞం గురించి వివరించసాగింది. ఆ యజ్ఞానికి కనీసం యాభైమంది మహర్షుల కైనా ఆహ్వాన పత్రాలు పంపాలి. కచునికి ప్రత్యేకంగా పంపాలి. తన తండ్రి తపస్సు నిర్విఘ్నంగా నెరవేరటానికి గాను ఆ యజ్ఞం. మహారాజు యజ్ఞం ఎందుకు లెమ్మని అనబోయారు కాని రాజమాత ఆ యజ్ఞాన్ని సమర్థించింది. ఆమెలో సంసారం పట్ల విరక్తి భావం ఏర్పడసాగింది. యజ్ఞం కారణంగా కొందరు మహర్షులను దర్శించుకొని పారమార్థిక విషయాలు వినవచ్చుననే భావంతో ఆమె కోడలు తలపెట్టిన యజ్ఞాన్ని సమర్థించింది. శుక్రాచార్యుల తపస్సు ఫలించాలన్న కోరికతో మాత్రం కాదు.

దస్యులు మళ్లీ తలెత్తకుండా అణచివేసి హస్తినాపురం చేరుకున్నాడు యయాతి. రాక్షస రాజ్యం సరిహద్దుల్లో ఎక్కడో యతి వుంటా డనిపించింది. వెదుకాలనుకున్నాడు కాని, దేవయాని జ్ఞాపకాలు నిలువ నీయలే దతణ్ణి. తీరా రాజభవనానికి వస్తే దేవయాని అతణ్ణి ప్రేమతో ఎదుర్కోలేదు. ధుమధుమలాడుతూ వున్నది. ఆమె కోపానికి కారణం అంగిరస మహర్షి లేఖ అని తెలిసింది. ఆ

లేఖను చేతిలో ఆడిస్తూ "ఈ ముసలాయనకు మా తండ్రి తపశ్శక్తి యెంతటిదో తెలిసినట్లు లేదు" అన్నది. "ఆ ముసలాయన కచుని పరమ గురువు సుమా" అన్నాడు. ఆమె కాసేపు నివ్వెరపోయింది. ఇంతకు అంగిరస మహర్షి ఆ లేఖలో రాసిం దేమంటే, "శుక్రాచార్యుల వారు చేయబోతున్న తపస్సు లోక కళ్యాణం కోసమో, కాక ఏదేని విధ్వంసక శక్తిని సంపాదించటానికో స్పష్టంగా తెలియందే ఆ యజ్ఞానికి రాలేను." శుక్రాచార్యుని తపస్సు విధ్వంసక శక్తిని సంపాదించటానికే అనేది అందరికీ తెలిసిన విషయమే. మహారాజు ఆ ప్రసక్తిని అంతటితో ఆపి వేశాడు. అతని కెక్కడా శర్మిష్ఠ కనిపించలేదు.దేవయాని నడిగితే "అశోకవనంలో వచ్చిన ఋషు లందరికీ విడిది ఏర్పాటు చేశాము కదా. వారిసేవ కోసం ఆమెను అక్కడ నియమించాను"అన్నది. "రాజ భవనాల్లో వుండేది గదా. ఆమె కక్కడ ఏమి తోస్తుంది?" అంటే, "తోచంది ఆమెకా? లేక ఆమె లేనందువలన మీకా?" అన్నది. "అలా యెందు కనుమానిస్తావు?" అంటే "ఆ నాడు విజయ తిలకం ఆమెచేత దిద్దించుకోలేదా?" అని ఎత్తి పొడిచింది. "అది రాజమాత ఆజ్ఞ" అంటే "ఔను క్షత్రియ కన్య కనుక మీ అమ్మగారికి ఆమె పట్ల ప్రేమ. నాపట్ల ద్వేషం." అన్నది. "నీపట్ల ద్వేషం వున్నా ఆమె చేయగలిగిదేమి?" అంటే. "నాకింత విష మిప్పిస్తే నాపీడ విరగడవుతుంది. ఈ రాజమహల్లో ఒక దాసికి విష మిప్పించిన సంగతి నాకు తెలియ దనుకున్నారా?" అన్నది. సంభాషణ మరీ విరసమై పోతున్నదని గ్రహించి యయాతి వూరుకొన్నాడు. "అమ్మ దిగాలుగా వుంటున్నది. మాటలు మానుకొని తప్పు చేశానేమో మనుమని ముఖం చూస్తే ఆమెలో మళ్లీ వెనుకటి ఉత్సాహం తిరిగి రావచ్చు" అనుకున్నాడు అంగిరసుడు, అగస్త్యుడు మొదలైన కొందరు మహర్షులు పాల్గొనక పోవట మొక్కటే లోపం. యజ్ఞం ఘనంగా జరిగింది. వచ్చిన పెద్ద లందరికి వీడ్కోలిచ్చే సందర్భంలో దర్బారు జరిగింది. యయాతి, దేవయాని సింహాసనం మీద ఆసీను లయ్యారు. సింహాసనం వెనుక భాగాన యవనిక కవతల రాజమాత కూర్చున్నది. దేవయాని ప్రక్కన వింజామర వీస్తూ శర్మిష్ఠ నిల్చున్నది. ఆ పని కోసమే శర్మిష్ఠను దేవయాని అశోకవనం నుంచి పిలిపించింది. దేవయాని గర్భవతి కనుక నిండుగా, మరింత అందంగా కన్పిస్తున్నది. సింహాసనాసీనులయ్యే ముందు రాజ దంపతులు ముందు వరుసలో కూర్చున్న మహర్షులకు వందనం చేసి, వాళ్ల ఆశీస్సులందుకున్నారు. మహర్షులు మంత్రాక్షతలు చేత బుచ్చుకునేటంతలో అమాత్యుడు హుటాహుటిన లోనికి వచ్చి మహారాజు చెవిలో బయట కచదేవుడు నిల్చి వున్నాడని చెప్పాడు. ఆ మాట దేవయాని విన్నది. "అమాత్యా! కచదేవులను సాదరంగా లోనికి ఆహ్వానించి వారిని యోగ్యమైన చోట, మహర్షుల మధ్య ఆసీనులను చేయండి. వారికి వందనా లర్పించనిదే నేను సిహాసనం మీద కూర్చోవటం భావ్యంగా వుండదు" అని ఆజ్ఞాపించింది. అమాత్యుడు తటపటాయించి, "మహారాణీ! వారు సభా భవనంలోనికి వచ్చేటట్టులేరు. సభానంతరం మిమ్మల్ని ఆశీర్వదించి వెళ్లిపోతారట" అన్నాడు. దేవయానికి కోపం వచ్చింది. "ఇంత దూరం వచ్చి సభలోనికి రాక పోవట మేమిటి? మమ్మల్ని అవమానించటం వారి ఉద్దేశమా?" అన్నది. "కాదు మహారాణీ! వారి వెంట ఒక తాపసి వున్నాడు. అతడు ఉన్మత్త స్థితిలో వున్నాడు. అలాటి వాని వెంట వచ్చి రసాభాస చేయటం వారికి సమ్మతం కాదనుకుంటాను" అని అమాత్యుడు విన్నవించుకున్నాడు. "అదేమీ కుదురదు, వారిని, వారివెంట వచ్చిన బైరాగిని లోనికి ఆహ్వానించండి." అని ఆజ్ఞాపించింది. అమాత్యుడు వెంటనే వెలుపలికి వెళ్లాడు. ఈ సంభాషణ అక్కడున్న వాళ్ళెవరికీ వినిపించలేదు. సభలో గుసగుసలు మొదలయ్యాయి. కొన్ని క్షణాల్లోనే అమాత్యుని వెంట కచుడు,

మరొక తాపసి సభలోకి వచ్చారు. ఆ తాపసి వెఱ్ఱి చూపులతో భయంకరంగా వున్నాడు. దేవయాని కచుని ముందు వంగి నమస్కరిస్తుండగా అతని దృష్టి వింజామర వీస్తున్న శర్మిష్ఠపై పడింది, "రాజపుత్రీ! మీరిక్కడ" అన్నాడు. "ఆమె ఇప్పుడు రాజపుత్రి కాదు. నా దాసి" అని చెప్పింది దేవయాని. " నీ కామె దాసి అయిందా? అదెలా" ప్రశ్నించాడు కచుడు. దేవయాని సమాధానం చెప్పలేదు. గుంభనగా నవ్వి వూరుకొన్నది. ఆ పిచ్చితాపసి శర్మిష్ఠ వైపు వెఱ్ఱి చూపులు చూస్తూ "నీ యీ దాసిని నాకిస్తావా? అని దేవయాని నడిగాడు. ఆమె పరిహాసంగా నవ్వితే "మీకెందుకు స్వామీ! భార్యగా స్వీకరిస్తారా?" అంటే "ఛ భార్యయేమిటి? నేనిమెను మగవాడుగా మారుస్తాను" అన్నాడు. సభ గొల్లున నవ్వింది. తెర చాటు నుంచి మహారాణి అమాత్యుణ్ణి ఉద్దేశించి, "అమాత్యా! ఆ పిచ్చివానిని వెంటనే బయటికి గెంటించండి. నాలుగు అంటించండి. ఇంకేదో పిచ్చివాగుడు వాగేట్టున్నాడు." అని ఆదేశించింది. అమాత్యుడు ముందుకు కదల బోతుండగా ఇంత వరకు స్తబ్ధుడై చూస్తున్న యయాతి పెద్దగా అరుస్తూ "ఆగండి. అతని మీద చేయి వేయవద్దు. ఈ సింహాసనం మీద కూర్చుండే అధికారం అతనిదే. అతడు నా అగ్రజుడు. యతి. " అని వారించాడు. తెరచాటున ఒక ఆర్తనాదం వినిపించింది. రాజమాత సకల మర్యాదలు విస్మరించి తెరను తోసుకొని వెలుపలికి వచ్చింది. ఎఱ్ఱని కళ్లతో, ముళ్లకంచెలాంటి జటాజూటంతో భయంకరంగా వున్న ఆ తాపసిని పట్టుకొని, చూడలేక కళ్లు మూసుకొని, "యతీ! నా యతీ!" అంటూ క్రిందపడి మూర్ఛపోయింది.

## 'మిసిమి' జనవరి 96 సంచిక : సవరణలు

| పుట | పంక్తి | ఎలా వుంది | ఎలా వుండాలి |
|---|---|---|---|
| 1 | 6 | పోలంకి సత్యం M.A | శ్రీమతి పోలంకి సత్య M.A |
| 34 | 5 | వస్తుగత వ్యాఖ్యానం, ఆత్మవాద వాఖ్యానం | వస్తుగత వ్యాఖ్యానం, భావవాద వ్యాఖ్యానం, ఆత్మవాద వ్యాఖ్యానం |
| 34 | 13 | ఆది భౌతిక | ఆధి భౌతిక |
| 34 | 15 | వాస్తవిక లక్షణాలు | వాస్తవిక లక్షణాలుగా |
| 34 | 15 | ప్రత్యక్షకరణ (AESTHETIC FEELING ) | ప్రత్యక్షీకరణ (PERCEPTION) ద్వారా గ్రహించడం జరుగుతుంది. ఏంనో విజ్ఞానంలో అధునాతన ప్రయోగాలు వస్తుగతాన్ని భావ గతం చేస్తున్నాయి. ఇందులో వైరుధ్యం లేదని నేననుకుంటున్నాను. సౌందర్యానుభూతి (AESTHETIC FEELING). |
| 34 | 22 | ప్రకృతి పై మానవనీయ భావన | ప్రకృతిపట్ల మానవనీయ భావన పెంపొందించు కోనంత వరకూ |
| 35 | 27 | ధరిత్రిపై వుంచిన | ధరిత్రిపై వుంచిన సాహితీకృతి |
| 36 | 9 | సౌంర్యాస్వాదం | సౌందర్యాస్వాదం |
| 36 | 26 | డా॥ నాగేంద్ర | డా॥ నగేంద్ర |

# పంచామృతాలు

# హనీమూన్ హారర్స్ అను పడకటింటి ముచ్చట్లు

- పురాణం సుబ్రహ్మణ్య శర్మ

మనవాళ్ళు శోభనం రాత్రులు అనిపిల్చుకునే వాటిని ఇంగ్లీషువాళ్ళు హనీమూన్ అని ప్రేయసీ ప్రియులు భార్యా భర్తలుగా ఫిరాయించాక జరిగే తతంగానికి ఆపేరు పెట్టి పిల్చుకున్నారు. మధురమైన రాత్రులన్నీ నిజానికి అంత మధురంగా వుండవు. లక్ష్మీ కటాక్షం అని యింటికాపేరు తగిలించినంతమాత్రాన వాళ్ళింట్లో డబ్బు ఏకంగా కట్టలు త్రెంచుకుని ప్రవహిస్తుందేమిటి? గోపాలరావు అని పేరెట్టుకున్న వాడు నిజానికి గోవుల్ని కాస్తున్నాడా? ప్రహ్లాదరావు అని పేరెట్టుకున్న ఆసామీ నాస్తికుడైనట్లు- మన నష్టల్సు అనగా శోభనాలు శోభనంగా వుండక పరమ భయంకరంగా వుంటావుండవచ్చు. పిల్లనీ పిల్లాడ్నీ గదిలోకి తోసేస్తారు. వరస వాళ్ళు తలుపు కంతలలోంచి లోపల ఏం జరుగుతున్నదో చూస్తూ ఉంటారు సరదాకి. ఇహలోపల సిగ్గు కొద్దీ భయంతో కంగారులో కిటికీ తలుపులన్నీమూసేస్తారు. వేసంకాలవయితే పరమ ఉక్క, చెమటలు కారి పోతాయి. వర్షాకాలం శోభనాలయితే రాత్రల్లా వానధారకు కింద గిన్నెలు తప్పెలాలు సర్ది పెట్టడంతో సరిపోతుంది. పైగా పందిరి మంచాన్ని చిలకలతో రకరకాల బొమ్మలతో పందిరిని అలంకరించడం కద్దు. శీతాకాలం కాస్త వెచ్చగా పడుకోవచ్చనుకుంటే చలిలో వణుకుతూ ఏం కాలక్షేపం? బొంతలుంటాయి కాని రగ్గులు దుప్పట్లు చాలవు కదా! అందరూ కాపలా కాస్తున్నారనే భయంతో రాత్రంతా శుభ్రంగా నిద్రపోకుండా జాగారం. గట్టిగా కదిలితే పందిరి మొత్తం వూగి మీదపడి పెద్ద చప్పుడయితే- ఏవిటేవిటి కేకలు, తలుపుమీద బాదడోలు. పెళ్ళి కొడుకు స్మోకరయితే గదంతా పొగ. ఉక్కిరి బిక్కిరయి శోభనం పెళ్ళికూతురు దగ్గులు.

ఇప్పుడంటే అది శోభనం గదిగా రూపు మారింది కాని అంతకు ముందు ఆ గదిలోనే తండ్రి పెద్ద బీరువా తల్లి ట్రంకుపెట్టె మంచం కింద ఏడిశాయి కావా? పైగా తండ్రి గారి ముక్కుపొడుం డబ్బా కిటికీలో మర్చిపోవడం ఒకటి. పందిరి మంచం క్రింద యింట్లో పాత సామాను గుండిగలు చెంబులు పాత్రలన్నీ అలానే ఉన్నాయి. ఎలకలు యిటూ అటూ పరిగెత్తుతుండగా పైన అటక మీద పిల్లి షికారులు. పెళ్ళి కొడుకుగారు కంగారుగా 'ఇవేమిటి ఈచప్పుళ్ళు ? అని అడగడం 'రాత్రుళ్ళు అటకమీద పిల్లి పరుగెడుతూ ఉంటుంది ఎలకల్ని తరుముతూ— భయపడకండని శ్రీవారికి నచ్చచెప్పడం.

పిల్ల నీ పిల్లాడ్నీ ముహూర్తం అంటూ ఎనిమిది గంటల రాత్రికి ముందే గదిలో తోసేసి హాల్లో బంధుబలగం పెద్దవాళ్ళ భోజనాలగోల! శ్రీమద్రమారమణగోవిందో హారి అంటూ. భోజనకాలే గోవిందనామస్మరణ ఇలా వుండగా బయటనుంచి ఏదో మైకులో ఓసినిమాపాట నాగయ్యగారి గొంతులో 'ఎన్నాళ్ళుండెద విహసుఖములలో కొన్నాళ్ళేగద మనసా పోయేనాడూ వెంబడిరాదూ పూచిక పుల్లనా-' హడలిపోయి కుర్రాడూ కుర్రదీ బిక్కుబిక్కుమంటూ చూస్తూ కూచున్నారు.

మరికొంతసేపటికి మరో పాట 'కుండలు మన్నేనోయ్ కొయ్యలు కట్టేనోయ్ కనుగొంటేసత్య మింతేనోయీ జగమే మాయా బతుకే మాయా' అంటూ శాడ్ సాంగ్. గదిలో వధూవరుల పిచిక హృదయాలు యీ సరససంగీతానికి ఏమై వుంటాయో 'పాఠక మహాశయులు వూహించుకోగల్రు.

హడావిడిలో గదంతా నీళ్ళపాలు - వాటర్ వాటర్ ఎవ్విరి వేర్ - పెళ్ళి కూతురికి నేలంతా తుడుచుకొని నీళ్ళు పిండి ఆరేసుకోవటం కార్యక్రమం అయిపోయింది. టేబిల్మీద లడ్డు తీసుకుని ఓటి నోట్లో వేసుగున్నారో లేదో ఎర్ర చీమలు నాలికను పీకేస్తున్నాయి. ఘోరంగా. ద్రాక్ష పళ్ళు గదిలో పెట్టారని నోట్లో వేసుకుంటే పెళ్ళి కూతురికి నోరంతాపులుపు రొడ్డు - రుచి చూడ కుండా కొని వుంటారు పులుపు ద్రాక్షని. కొంచెం నడుం వాలుద్దామనుకుంటే మంచం పాత కాలానిదేమో యిటూ అటూ కదిల్తే కిర్రుకిర్రు మని సవుండు ఆఫ్ మ్యూజిక్. ఆ మంచానికి బాగా నెరియలు వుండటంతో నల్లులు కూడా పైకి వచ్చి దంపతుల్ని నిద్రపోనివ్వకుండా కుడుతున్నాయి.

అసలా ఊర్లో దొంగల భయం ఎక్కువ. పగలు మన యిళ్ళలో చిల్లర పనులు చేసి పెట్టే వాళ్ళే రాత్రులు యిళ్ళపైకి ఎక్కి కొబ్బరికాయల దొంగతనాలు చేస్తారు. దొడ్లో ఆరేసిన బట్టలు ఎత్తుకుపోతారు. అంటుగిన్నెలు పెరట్లో పారేస్తే దొంగిలించి మరో వూళ్ళో అమ్ముకుంటారు. అలాటి దొంగ ...యింటి మీదెక్కి పచార్లు చేస్తున్నాడు. వాడి అడుగుల చప్పుళ్ళు పెంకులు కదలడం వినిపిస్తున్నాయి. 'అమ్మో దొంగ' అంది అరచేతుల్తో గుండె కప్పుకుని' బయట కెళ్ళి చూస్తాను తలుపు తీయమను మీ అమ్మను' అన్నాడు ఆహీరో. 'దొంగాడు ముక్కుకొరుకుతాడు. వెళ్ళొద్దు' అని ఆ అమ్మాయి అబ్బాయిని గట్టిగా వాటేసుకుంది. దొంగ వలన ఆహా గాఢ పరిష్వంగ సుఖం దక్కింది అబ్బాయికి. దొంగలు చీకటి రాత్రుల్లోనే విచ్చల విడి గా తిరుగుతారు. ఒంటికి నూనె రాసుకుంటారు ఎవరన్నా పట్టుకుంటే జారిపోడానికి. మసి మొహాలకి పూసుకుంటారు పోలికలు గుర్తు పట్టకుండా. రాత్రి నిశ్శబ్దంలో చిన్న చిన్న చప్పుళ్ళు కూడా పెద్దగా వినిపిస్తున్నాయి. వీధిలో అడుగుల చప్పుళ్ళు. కావిళ్ళ మోతలు. వుండి వుండి ఘల్లుఘల్లు మని గజ్జెల చప్పుళ్ళు. 'అదేవిటి గజ్జెల చప్పుడు' అన్నాడు పెళ్ళికొడుకు. 'భయంలేదు. మాయింట్లో బాల వస్తూవుంటుంది. దేవత. ఏమీ చెయ్యదు.' అందిపిల్ల. 'దేవుడా? దెయ్యమా? దయ్యాలంటే నాకు భయం' అంటూ ఆ అబ్బాయి బిక్క మొహం పెట్టాడు. 'భయం లేదు. భయంలేదు' అని మళ్ళీ పిల్లాణ్ణి దగ్గిరకు తీసుకుని పెద్ద ఆరిందాలా కావిలించుకుంది. ఇంతలో తలుపు మీద బాదుడు. తలుపు తెరుచుకుంది. పెళ్ళి కూతురి తండ్రి ఏవో కాయితాలు డబ్బు తీసుకోవాలి బీరువాలో అని గదిలో జొరబడ్డాడు. పిల్లలు బిక్క చచ్చిపోయారు. ముక్కుపొడుం డబ్బీ తీసుకుని వెళ్ళిపోయాడనుకోండి. వాళ్ళమ్మ బయట తిడుతోంది తండ్రి చేసిన అవకతవక పనికి. ఆయన హరికథ పెట్టించాడు వచ్చిన చుట్టాలకి కాలక్షేపానికి ఆయన బిగ్గరగా పాడుతున్నాడు. బల్ల అదిరేట్లు గంతులు వేస్తున్నాడు. హరికథ తరవాత ఆటగాళ్ళు వచ్చి తోలుబొమ్మలాట వేస్తున్నారు. పెళ్ళి కొడుకు 'నేను తోలు బొమ్మలాటచూడాలి, ఎప్పుడూ చూళ్ళేదు.' అన్నాడు. 'అయ్యో ఖర్మ బయట గొళ్ళెం పెట్టి వెళ్ళిపోయింది మా అమ్మ' అంది పెళ్ళి కూతురు. ఇంతలో పురుగుపడి బెడ్రూం లైటు ఆరిపోయింది. అంతా చీకటి. చీకటమ్మా చీకటి, బయట నుంచి కీచురాళ్ళ చప్పుడు. అంతట ఉభయులూ చీకట్లో నిద్రకుపక్రమించిరి. నిద్రలో తలుపు తెరుచుకుంది రహస్యంగా - అది తెల్లవారు ఝాముకాబోలు. తల్లి లోపలికి వచ్చి పెళ్ళి కుమార్తెను లేపి గదిలోంచి బయటకు తీసుకుపోయింది తరవాత ఇన్స్పెక్షన్ - కిలకిలలు కలకలలు.

# నూరేళ్ళ పంట

- 'ఈనాడు' సౌజన్యంతో

'పెళ్ళంటే నూరేళ్ళపంట' - అని మురిపించిన పాట లున్నాయి. దాంపత్య జీవనం అనుకూల పవనాల్లో వాలుగాలికి ఏటి పడవలా సాగిపోతున్నప్పుడు ఆ మురిపాలు నిజమే అవుతాయి. అలా కానప్పుడు ఆ పెళ్ళే నూరేళ్ళ మంట అనిపించక మానదు. "నిక్షేపంగా పెళ్ళిచేసుకో. భార్య అనుకూలవతి అయితే సుఖపడతావు. లేదంటే వేదాంతివి అవుతావు" అన్నాట్ట సోక్రటీసు. పాపం ఆయనకూ, ఆయన భార్యకూ నిత్యం షష్టాష్టకంగానే ఉండేది. ఇష్టంలేని పెళ్ళాన్ని 'ఒసే' అన్నా తప్పే 'అమ్మా' అన్నా తప్పే అన్న సామెత చందాన సోక్రటీసు సతీమణి భర్త ఏమన్నా ఇంతెత్తున విరుచుకు పడేదిట. ఏడడుగుల బంధం ఇనుప సంకెళ్ళయి బిగుసుకుపోగా అలాగే కాలం నెట్టుకురాక తప్పలేదా వేదాంతికి. వివాహం ఉద్వాహం, పరిణయం, కల్యాణం వగైరా రక రకాల పేర్లతో పిలిచే ఈ పెళ్ళంటే ఏమిటి అని ప్రశ్నించుకుంటే - ఒక మగవాడు ఒక ఆడది సమాజ సమ్మతంగా కలిసి కాపరం చేయటం - అని సింపుల్‌గా చెప్పుకోవచ్చు. సమాజపరంగా నరనారుల్ని కలిపే కార్యక్రమమే పెళ్ళి అనేది. ఈ పెళ్ళికి బోలెడంత గత వర్తమాన చరిత్ర లున్నాయి. భరించే వాడే భర్త అన్నభావం ప్రబలి అగ్నిసాక్షిగా తాళికట్టించుకున్న పతీమణి ప్రతిచిన్న విషయానికీ భర్తమీదే ఆధారపడుతూ ప్రతి ఇబ్బందికీ అతన్నే నెపపెడుతూ - ఎన్నటికీ మానని పుండులా నిత్యం సలుపుతున్నప్పుడు - పెళ్ళంటే చేతులారా ఓ గుదిబండను మెడలో తగిలించుకోవటం - అని నిర్వచించే సందర్భాలు కూడా ఉంటూ ఉంటాయి. "పతి కాకు జుట్టిచ్చి మదికాంక్ష దీరంగ యుందునో యని యుందు చందమామ --" అనే అనుకూలవతి భార్యగా లభించిన తరుణాల్లో "గృహమేకదా స్వర్గసీమ-" అన్నట్ల్యాయెట్లు వినపడటం కూడా వింతకాదు. అయితే ఆర్థిక, సామాజిక రంగాల్లో కలుగుతున్న అనేక మార్పులు వివాహవ్యవస్థపై కూడా తమ ప్రభావాన్ని చూపుతున్నాయి. వివాహంలోని అసలు ధర్మం మరుగునపడి అనవసరపు తంతులు, ఆర్భాటాలు ఎక్కువయినాయి. మనసులేని మనువుకు మంత్రాలు ఏలరా - అని సహృదయులు గొణుక్కుంటున్నా - కన్యాశుల్కాలు, వరకట్నాలు వెర్రితలలు వేయటంతో వధూవరుల ఇష్టాలు నామమాత్రమై పోయాయి. మనసుకు నచ్చినవాడు మొగుడుకాని మంగళసూత్రం కట్టగానే మొగుడుకాడు - అన్న భావం ప్రబలటానికి కారణం డబ్బే అగ్రస్థానం వహించిన బలవంతపు పెళ్ళిళ్ళే అని చెప్పుకోవచ్చు. అయితే ఈ పెళ్ళి తంతు అన్ని చోట్లా ఒకే మాదిరిగా ఉండదు. దేశ దేశాలలో రక రకాల వివాహపద్ధతులు అమలులో ఉన్నాయి. నాగరీకులం అని రొమ్ము విరుచుకొని గర్వంగా తిరిగేసమాజాలలో వరకట్నపు, కన్యాశుల్కపు బలవంతపు పెళ్ళిళ్ళు ధారాళంగా జరిగిపోతూఉండగా - నాగరికత ఎరగని కొన్ని ఆదివాసి తెగలలో స్వేచ్ఛా ప్రణయపు స్వచ్ఛమైన వివాహాలు ఈ నాటికీ జరుగుతూఉండటం విశేషమే అని చెప్పుకోవచ్చు. అయితే వీటిలో కూడా ధనం తన ప్రభావాన్ని చూపటం మానలేదు.

దక్షిణ గుజరాత్ ప్రాంతంలో నివసించే దోడియాన్, నాయకా వగైరా ఆదివాసి తెగలవారి వివాహపు అలవాట్లు ఒకింత విస్మయకరంగానే ఉంటాయి. మనసుకు నచ్చిన కన్యను వివాహమాడే లనుకున్న వరుడు అమ్మాయి తండ్రికి విధిగా కొంత కన్యాశుల్కం చెల్లించాలి. అలా చెల్లించలేని పక్షంలో కాబోయే మామగారి ఇంట్లో చేరి అయిదేళ్ళపాటు అడవాచాకిరీ చేసి రుణం తీర్చుకోవచ్చు. ఈ అయిదేళ్ళూ ఈ అబ్బాయినీ, అతనుకోరిన అమ్మాయినీ తాత్కాలిక భార్యా భర్తలుగానే

తెగవారు గుర్తిస్తారు. తాత్కాలిక భార్యాభర్తలు మామూలు దంపతులలాగానే జీవించవచ్చు. ఈ పద్ధతిని "ఖందాడియో" అని పిలుస్తారు. ఖందాడియో సాగిస్తున్న సమయంలో తాత్కాలిక భార్య నిజం గర్భం ధరించినా తెగవారు తప్పు పట్టరు. ఆ పిల్లలకు ఖందాడియో కథానాయకుణ్నే తండ్రిగా గుర్తిస్తారు. నిర్ణీత గడువు ముగిసిన తర్వాత ఈ జంట యథావిధిగా పెళ్ళి చేసుకొని కాలక్షేపం చేస్తారు. ఒక్కోసారి గడువు ముగియకముందే అమ్మాయి కాబోయే అత్తవారింటికి వెళ్ళి అక్కడి పరిస్థితులు నచ్చితే మళ్ళీ కన్నవారింటికి రాకుండా అక్కడే సెటిలయిపోవచ్చు. ఇవేవీ కాకుండా ఖందాడియో కాలంలో అమ్మాయికీ అబ్బాయికీ మధ్యలోనే పొరపొచ్చాలొచ్చి ఒకళ్ళకొకళ్ళు నచ్చకపోతే వివాహం నిర్బంధమేమీ కాదు. ఎవరికి వారే యమునాతీరే అనుకుంటూ విడిపోయి మనసుకు నచ్చిన వేరే వారిని నిరభ్యంతరంగా వివాహం చేసుకోవచ్చు. ఈ ఆదివాసి తెగలలో మగ, ఆడ అనే తేడా లేకుండా అందరికీ వ్యక్తి స్వేచ్ఛ మిక్కుటంగా వుంది. ఏ స్త్రీ గాని, పురుషుడుకాని నచ్చని భాగస్వామిని విడాకు లిచ్చి తేలికగా వదిలించుకోవచ్చు. అంత తేలికగాను మరొకర్ని పెళ్ళి చేసుకోవచ్చు. వివాహానికి, విడాకులకు ఒకే మంత్రంలా వీరి వివాహాలు అతి సులువుగా సరళంగా జరుగుతాయి. ఆ కారణంవల్లే ఈ తెగలలో భగ్న ప్రేమలకూ, బాష్పకణాలకు తావుండదు. తరతమ భేదాల కోటగోడ లుండవు. "కష్ట భూయిష్ఠ దుఃఖాంత ప్రేమకథలతోడ విసివిపోతిని పుటలు త్రిప్పిన కొలది -" అని ఈ తెగలోని కవులు ఆరాటపడిపో నక్కర్లేదు. సులువైన సామాజిక కట్టుబాట్లవల్ల దాదాపు ప్రతిప్రేమకథా వీరిలో సుఖాంతమే అవుతుంది. శాస్త్రపరిశోధనలూ, విజ్ఞాన వికాసమూ అంతా సర్వతోముఖంగా సాగుతున్న ఈ రోజులలో కూడా పెళ్ళిళ్ళ దగ్గర కొచ్చేసరికి పాతచూర్లనే పట్టుకు వేళ్ళాడుతూఉండటం వల్లే అనేక అనర్థాలు జరుగుతున్నాయి. వధూవరుల ఇష్టానిష్టాలుతప్ప డబ్బు, కులం, మతం వగైరా మిగతా విషయాలను జనం అంతగా పట్టించుకోకుండా ఉండటం అలవాటు చేసుకున్నప్పుడే పెళ్ళి అనేది నూరేళ్ళ పంటగా విలసిల్లుతుందని చెప్పవచ్చు!

## Threthayuga

Have you grasped the incredible wonder! The daughter of Emperor Bali is in Threthayuga. His Son's daughter is in the Dwaparayuga. From this the readers will be able to rightly guess about the authenticity of the Yugas. One more point, please. Examine the dynastic tree given above, it becomes obvious that to completely destroy one dynasty God has to assume four Avataras (Incarnations). Wonderful! It is impossible to say what a great dynasty it was! We cannot find any other dynasty in the history of our country which has fought for the welfare of its people for so many generations. As Sri Krishna is not an Aryan, he did not kill Banasura, as the Aryans did. After defeating him Krishna contracted forming enduring blood relationship with him through the marriage of his grandson with the daughter of Banasura.

# సౌందరనందము

**డా॥ యు. ఎ. నరసింహమూర్తి.**

సౌందరనందము మానవతా మందిరము. వెలివాడలో వెలసిన దేవాలయము ఆంధ్ర సరస్వతీ శ్రవణోత్పలము. తొలి తెలుగు దళితకావ్యము. ఆ కావ్యం చూపినది నవధర్మ మార్గము.

భావ కవిత్వమంటే స్వప్నములగిలుకు కవుల వ్రాత అనే అపప్రథకు ఒక అపవాదంగా అవతరించిన అపూర్వరచన సౌందరనందము. ఆ కావ్యం అందించే అనుభూతి - 'ఒక సడలని కౌగలింత - తెప్పతుదల చిందెడు చిర్నగవు. విరతిలేని స్వప్నము' ఆ పద్యాలు మిసిమి మీగడలు. ఆ కావ్యం చదివే రసహృదయుడికి 'నాకీ లోకముతో నేమి' అనిపిస్తుంది. సమయమూ, సీమా తెలియవు. ఇంతే అయితే ఆకావ్యం ఒక భావకవితా కుండికగా మిగిలి ఉండేది. ఈ శతాబ్ది గర్వించదగ్గ తెలుగు కావ్యం గాని, తొలి తెలుగు దళిత కావ్యం గాని అయ్యేది కాదు.

ఆ పద్యాలూ పాతవే. భాషా పాతదే. కాని కవిత్వం కొత్తది. దర్శనం ఇంకా కొత్తది. శరీరాన్ని అతిక్రమించి ప్రకాశించే లావణ్యంలో ఆ కావ్యంలోని అక్షరాక్షరంలోను ఒక అందం తొణికిస లాడుతుంది. పద్యం తన ప్రాభవాన్ని కోల్పోయిందని అనుకుంటూన్న ఈ రోజుల్లో కూడా ఆ పద్యాలు వసివాడలేదు. వన్నె చెడలేదు. ఆ భాషకు బూజుపట్టలేదు. అందుకు ఆ కావ్య హృదయమే కారణము. అదొక నిత్య వసంతారామము. అక్కడ ఆకులూ రాలవు పూలూ వాడవు.

సౌందరనందం ఆవిర్భావం తెలుగు సాహిత్యంలో ఒక చారిత్రికావసరం అయింది. సమాజానికి సాహిత్యానికి మధ్య వచ్చిపడ్డ విప్రలంభాన్ని అంతరింప చేయడానికి ఒక మరీచి ఆశ్రమంలా వచ్చిపడింది సౌందరనందము. కల్పనాకైలాసం నుండి వేదనా వసుంధరకు దిగివచ్చిన క... భాగీరధి సౌందరనందము. పౌరాణిక విశ్వాసాల నుంచి సమకాలిక సత్యాల వేపు దృష్టి సారి... సమతా సారధి సౌందరనందము.. అందులో ఆనాటి సామాజిక చరిత ఉంది. ఈనాటి సంక్లిష్ట సామాజిక సమస్యలకు చక్కని పరిష్కారం ఉంది.

రెండున్నర సంవత్సరాల పాటు ఇద్దరు కవులు ఆ కావ్యాన్ని రాసేరు. ఒక గొప్ప కావ్యాన్ని ఇద్దరు కవులు రాయడం మనకు కొత్తకాదు. వింతాకాదు. కాని అది మహాకావ్య ధర్మానికి కొంత విరుద్ధమైనది. ఆ వైరుధ్యాన్ని అధిగమించి చరితార్థులైన జంటకవులు పింగళి- కాటూరి. 1932లో సౌందరనందం తొలి ముద్రణ జరిగింది.

గాంధీయుగం ఆరంభమైనప్పటి నుండి భారత దేశంలో వేల సంవత్సరాల నాటి బౌద్ధశకం మళ్ళీ పునర్విశాసం పొందడం ఆరంభమయింది. ఈ రెండింటి సమ్యక్సమ్మేళనమే సౌందరనందము. 'ఈ చిఱుత కబ్బ మర్హత గడించుకొనుగాక - యాంధ్రవాణి కనుగొనల జాల్గొను ప్రసాదకణలవాప్తి' - అని కోరుకున్నారు పింగళి - కాటూరి.

సౌందరనందము అర్హతయానము పొందిన కావ్యము. అర్హత అనేది బౌద్ధములో అత్యున్నతస్థాయి. రూపరాగాలు, అరూపరాగాలు, మానము, ఉదచ్చ, అవిద్య అనే అయిదు సంయోజనాలను వదులుకున్న వాడిని బౌద్ధులు అర్హుడని అంటారు. శ్రావణేరదీక్ష, భిక్షుశుశ్రూష, ఉపసంపదాదీక్ష అనే దశలను దాటి శ్రమణుడయిన తరువాత అర్హత లభిస్తుంది నందుడు అర్హతను పొందడ..., సుందరి అర్హతలో కూడా అతని సహధర్మచారిణి కావడం ఈ చిన్న కావ్యంలో సౌందరనందం కావ్యంగా అర్హతను పొందడానికి ఎన్ని దశలను అధిగమించిందో, ఎంత ఎదిగిందో సహృదయులు గ్రహించగలరు.

ఈ చిన్న కావ్యంలో తొమ్మిది సర్గలున్నాయి. అయినా పెద్ద కథలేదు. తొమ్మిది నిముషాలలో

చదువదగ్గ కథానికకు తగ్గ కథే అందులో ఉంది. కథానికకు ఒకే సన్నివేశం ప్రధానంగా ఉంటుంది. ముందు వెనుక సంఘటనలు దానికొక ఆకృతి నిస్తాయి. బుద్ధుడు నందుని ఇంటికి బిక్షకు రావడం ఈ కావ్యంలోని ప్రధాన సన్నివేశం. ఇది కేవలం యాదృచ్ఛికం. ఈ సన్నివేశంతో ఏమీ సంబంధం లేనిరీతిగా బుద్ధుడు కపిల వస్తుపురానికి తిరిగి రావడంతో ఆరంభమవుతుంది కావ్యం. బుద్ధుడు కూడా ముందుగా నందుణ్ణి బౌద్ధ శ్రమణకుణ్ణి చెయ్యాలని, అర్హతను ప్రసాదించాలని అనుకోలేదు. తన భిక్షకు నివ్వనందుకు బుద్ధుడు బాధ పడలేదు. ఆ సమయంలో బుద్ధుడు గ్రహించినది సుందరీనందుల దాంపత్య శృంగారంలోని తాత్పర్యం. అంతటి తాత్పర్యం కలవారే తన ఉద్యమ సాఫల్యానికి సహకరించగలరని బుద్ధుడు విశ్వసించేడు. అందుకే ధర్మ సంవాదము. ఉపదేశము చోటు చేసుకున్నాయి. నందుడు శ్రమణకుడై అర్హతను అందుకున్నాడు. అతని ధర్మపత్ని సుందరి అక్కడ కూడా అతని సహధర్మచారిణి అయింది. ఇదే కథ.

కథ ముగింపు తొందరగా కుదిరింది కాదు అన్నారు కాటూరి వారు. ఆలస్యమైతేనేమి? ఈ కథకు ఒక గొప్ప ముగింపు దొరికింది. నందుని పరోక్షంలో కూడా అతని ననుసరించిన సుందరి తపస్విని అయింది. 'తను రాకృతి దాల్చిన భూతదయ' అయింది. అప్పుడొక దుఃఖ వివశుడైన అనాథబాలకు డామె నొక మురికి వాడకు తీసుకెళ్లాడు. అక్కడ ప్రాణం విడుస్తూన్న ఒక ముసలిస్త్రీకి సేవచేస్తూ నందుడు బౌద్ధ భిక్షువుగా ఉన్నాడు. ఆ వృద్ధురాలు తన కొడుకును నందునికి, కూతురును సుందరికి అప్పగించి కన్ను మూసింది. బుద్ధుడక్కడకు వచ్చి ఆబిడ్డలకు సుందరీ నందులని పేరుపెట్టి సుందరీనందులకు ఎడబాటును కల్పించిన ఋణం తీర్చుకున్నాడు. అంతటితో అర్హులైన సుందరీనందుల దాంపత్య శృంగారం వాత్సల్యంగా పరిణమించింది. ఆ వాత్సల్యం విశ్వవ్యాప్తమయింది. ఇందుకే ముగింపు ఆలస్యమయింది. ఇందుకే సౌందరనందం తొలి తెలుగు దళిత కావ్యం అయింది.

సత్యము - ధర్మము - దయ అనే మూడు బౌద్ధులకు మంత్రాల వంటివి. సౌందరనందంలో బుద్ధుడు సత్యానికి, నందుడు ధర్మానికి, సుందరి దయకు ప్రతీకలు. ఆ త్రివేణీ సంగమమే సౌందరనందకావ్యం.

అహింస, అస్తేయము సత్యము - బ్రహ్మచర్యము సమత్వము బుద్ధుని ఆశయాలు. అతని దృష్టిలో శీలం కవచము. అందుకే బుద్ధుడు కర్మను అంగీకరిస్తూ దానిని నైతికంగా తీర్చిదిద్దాడు. ఆ నైతిక భాష్యమే సౌందరనందమయింది. భగవద్గీత నిష్కామ కర్మను బోధిస్తుంది. ఆ సామ్యాన్ని స్ఫురింప చేయడానికి బుద్ధుని పునరాగమనాన్ని శ్రీ కృష్ణుని మధురా నగర ప్రవేశాన్ని స్ఫురింప జేసే పద్యంలో రాసేరు పింగళి - కాటూరి. నిష్కామకర్మ గీతకు - బుద్ధునికీ సమానమే. అయినా వర్ణాశ్రమ ధర్మానుసరణంలో భేదం కనిపిస్తుంది. గాంధీజికి గీత మీద ప్రగాఢ విశ్వాసం ఉన్నా ఈ విషయంలో ఆయన బౌద్ధుడే. ఆ సేతుశీతాచలం తాలోత్తాలంగా ఎగసి పడుతూన్న ఆ గాంధీ దర్శనాన్ని రసధ్వని మహితం చేయడానికే సౌందర నందానికి అలాంటి ప్రారంభం. అలాంటి ముగింపు అవసరమయ్యాయి.

'వీరు వారనుచు రోయక యెల్లరుఁ గూడి మాడి' - బుద్ధుని బోధ వినడానికి వెళ్ళారట. శ్రీశ్రీకి ఎన్నాళ్ళో ముందుగా 'ధరాఖండలుడున్ తదీయ శిబికావహుడున్' - సౌందరనందంలో ఏకమయ్యారు. గాంధీ బౌద్ధం నుండి తెచ్చుకున్నది అహింస - సమత్వము మాత్రమే కావు. 'అస్తేయపథము' ఇందులో గొప్పది. ఇతరుల సొమ్ముకు ఆశించకపోవడం ప్రధానం. స్వార్థత్యాగం ఇందుకు సోపానం. గాంధీ ఉద్యమం ఇందులో విజయవంతమయింది. ఆనాడు భారతీయులంతా ఇతరుల సొమ్మును

ఆశించకుండా, తమ సరస్వాన్ని ధారపోసి జాతీయోద్యమాన్ని కొనసాగించారు. నందుడు సుందరి తమ దాంపత్యాన్ని, సర్వస్వాన్ని ధారపోసి దీనజనోద్ధరణకు జీవితాలను అంకితం చేయడం ఆ ఉద్యమ చరిత్రే. ఒక ఉద్యమ చరిత్రను కళాధర్మాలను అతిక్రమించని రీతిలో కావ్యంగా తీర్చిదిద్ది గురువుచేత 'కృతార్థులు మీరు' అనే యోగ్యతాపత్రాన్ని పొందేరు పింగళి-కాటూరి.

ప్రాచీన కావ్యాలలో సంభోగ శృంగారం, భావకవిత్వంలో విప్రలంభ శృంగారం తమ అవధులు దాటేయి. ఒక్క సౌందరనందంలోనే దాంపత్య శృంగారం భవభూతికి అసూయ కలిగేలా పోషిత మయింది. వ్యక్తి నిష్ఠమైన దాంపత్య శృంగారం సమాజపరమైన వాత్సల్యంగా పర్యవసించడమే ఈ కావ్యంలోని రసధ్వని. పింగళి -కాటూరి మాత్రమే దీనిని తెలుగులో సాధించేరు.

లాలసకు ధర్మానికి మధ్య కొనసాగిన సంకుల సమరం సౌందరనందంలో ఉంది. ఇది మనకు కొత్తకాదు. శృంగార - ధర్మ వీర సంఘర్షణ మనుచరిత్రలోను, గార్హస్థ్య - సన్న్యాస ఆశ్రమ సంఘర్షణ పాండురంగ మాహాత్మ్యంలోను చిరస్థాయిగా.నిలిచేలా పోషించ బడ్డాయి. కాని సౌందర నందంలోని విషయం ఇంకా విశాలమైనది. పాత సన్నివేశాలు రెండింటిలోనూ ఎప్పటికీ ఎంతో కొంత స్వార్థం మిగిలే ఉంటుంది. సౌందరనందంలో అంతా త్యాగమే. అందుకే పింగళి - కాటూరి శిరీషకు సుమపేశల సుధామయోక్తులకు పరిపూర్ణత కల్పించేరు. పదగుంభనకు పగిడీ చుట్టేరు.

ఈ కావ్యానికి పికధ్వానము శబ్దము జ్యోత్స్నలు చల్లగాలులు,- స్పర్శ అచ్చపు బంగారము, రూపము తుషార జలములు, పూవుతేనియలు రసము. కపురంపుం బలుకులు గంధము. ఈ రసజగత్తులోని నింగి నేలనిప్పు నీరు గాలి మన పంచేంద్రియాలకు ఇంకొక అనుభూతిని కలిగించవు. అందుకే సౌందరనందస్మృతి శాశ్వత మధురానుభూతి.

కామ తృష్ణ - భవతృష్ణ - విభవ తృష్ణ సుందరీ నందుల విషయంలో భిక్షాగమనము - పరివ్రాజనము - నిరీక్షణము - అనుతాపము అనే సర్గలలో వివరింపబడ్డాయి. ఇక్కడ కథ కామ ఉపాదానం నుండి శీలవ్రత ఉపాదానానికి నడచి నాయినా నాయకులు ఒక అనిమిత్తస్థితికి చేరుకుంటారు. ఉపదేశము ధర్మ సంవాదము సహధర్మచర్యము అనే సర్గలలో సుందరీ నందులు సమ్యక్‌దర్శనము - సమ్యక్ జ్ఞానము - సమ్యక్ చరితము అనే త్రిరత్నాలను చేపట్టి బుద్ధుడు ధర్మము సంఘము అనే త్రిశరణాలను వరిస్తారు. మహాక్లేశాల నుండి విముక్తులయి శ్రమణులవుతారు.

ఈ శతాబ్దం చివరిపాదాన్ని అతలాకుతలం చేస్తూన్న ఉగ్రవాదం స్త్రీవాదం దళిత వాదాలకు సమ్యక్ పరిష్కారానికి మరొక బుద్ధుడు, మరొక గాంధీ అవతరించవలసిన ఆవశ్యకం కనిపిస్తుంది. కావ్య ధర్మానికి కలికి తురాయిగా ఆ మూడు సమస్యలకు త్రికాలా బాధితమైన పరిష్కారం సౌందరనందంలో లభిస్తుంది. ఆ కావ్యంలోంచి ఇంకొక బుద్ధుడు అవతరిస్తాడు. ఇంకొక గాంధీ అంకురిస్తాడు. ఆ కావ్యంలోని నవధర్మం రాచనగరును వెలివాడకు నడపించింది. రాజకుమారులైన సుందరీ నందులు హరిజనులుగా మారేరు. స్త్రీలకు సమానత్వం కల్పించడమే కాక సుందరికి బాలనందుని నందునికి బాలసుందరిని అందించడం ద్వారా ఈ కవులు స్త్రీపురుష వివక్షను అంతరింప జేసారు. పద్యము - పాత భాష - వ్యాకరణము పాత పద్ధతిలో నేటి అభిరుచికి కొంత విరుద్ధంగా ఉన్నా అదే కావ్యపరమార్థంకావు. అయినా అవి ఈ కావ్యానికి అదనపు ఆకర్షణలుగా నిలిచేయి. అందుకు కారణం వాటి వెనుక నున్న స్ఫూర్తి. ఈ కావ్యపు ఆత్మ ఉజ్జ్వలమైనది. దాని కాంతి ఈ కావ్యంలోని అక్షరాక్షరానికీ ఆరని వెలుగు నిచ్చింది.

ఇల్లు అడవి అయితే అడవిని దేవళం చేసే రహస్యాన్ని బోధించిన ఆధునిక సంగీతి సౌందరనందము.

MISI/మిసిమి RNI Regd No 45042/90 Telugu Monthly, Hyderabad-500 020 Postal Regd No H/SD/191

# THE RIGHT PLACE FOR YOUR SOFTWARE VENTURES

ANDHRA PRADESH INDUSTRIAL INFRASTRUCTURE CORPORATION LIMITED (APIIC) in it's journey towards exploring global markets is setting up one of the biggest stand-alone Software Parks at Hyderabad, spread over a sprawling 175 acres of land with all State-of-the-art infrastructure facilities. The park will have an investment of Rs. 900 crores to create Whopping 4.5 million Sq.ft. of space. This will be the most well-equipped and well planned INFO-TECH city with global standards.

## ADVANTAGE HYDERABAD

- A wide band IBS Earth Station with 64 kbps Data Communication Link in opera- ...des an international gateway to ...re units.
- Soft Ware Technology Park at Hyderabad is home for several computer software gaints like Intergraph, Park International, UUNET etc.
- Large pool of skilled manpower.
- Company loyalty and low personnel turn-over.
- Number of reputed academic, technical and professional institutions.
- Hyderabad is centrally located in India and within an hour flying distance from all major cities; well connected by rail and road.
- Well developed social infrastructure with corporate hospitals with world class medicare facilities, Schools/Universities of academic excellence with recreation facilites and saluburious climate all through the year.
- Moderate costs of living giving the advantage of a big city, Infact the fastest growing city in the country but without many hazards of big cities.

## FEATURES OF INFOCITY, HYDERABAD

- Located very close to the heart of Hyderabad Metropolis, in the midst of the posh locality of Jubilee Hills - 20 minutes drive from the airport, 15 minutes from the city centre and 5 minutes from the posh jubilee hills.
- Wide choice to entrepreneurs who want to setup their projects with world class facilities for Software units at the most reasonable prices.
- State-of-the-art-conditioned built-up space fc. setting up projects of the MNCs and Indian Information Technology companies with provision for executive flats, recreation facilities etc.
- High quality internal Roads Network, Drains, Sewerage, Water and other Civic amenities.
- Single stop facility for providing all clearances.
- Captive power plant ensuring quality and un-interrupted power supply.
- Captive telecommunication centre to cater to High speed data communication requirements of the Hardware and Software Industry for Voice, Data and Video Conferencing facilites.




ANDHRA PRADESH INDUSTRIAL INFRASTRUCTURE CORPORATION LIMITED
6th Floor, Parisrama Bhavan, Basheerbagh, Hyderabad - 500 029
Phone : 91-40-237622 Fax No. 91-40 - 240205